అన్నీ వేసుకుతిన్నాడు. రోగం తిరగబెట్టుతుందని పార్వతి గట్టిగా నమ్మింది. కాని అట్లా జరగలేదు. పార్వతి కేమాత్రమో ఆశాభంగంకూడా అయింది. కాని కొడుకు క్కెవరూ మందు పెట్టలేదన్న సంతృప్తిలో అది అంతగా పైకి రాలేదు.

తరవాత కొద్దిరోజులకు నారాయణ మాటలసందర్భంలో, ''జబ్బుగా ఉన్నవాణ్ణి న్యూసెన్స్ చెయ్యగూడదు. చీటికీ మాటికీ వచ్చి, 'ఎట్లాఉందీ? తలనొప్పా? లేదూ? దాహంగాఉందా? మంచినీళ్ళివ్వనా? వద్దూ? ఏమన్నా తాగుతావా? ధారకంలేకుండా ఎట్లా ఉంటావూ? కాళ్ళుతీపులా? లేవూ?' ఈవిధంగా తగులుకుంటే రోగికి ఎట్లా ఉంటుంది? బిక్కమొహం వేసుకుని మనుషులు దగ్గిరికివచ్చి పలకరిస్తుంటే, 'ఇంక ఈరోగం నయంగాదల్లేఉంది!' అని పిరికిగుండెవాడు దడుచుకున్నా దడుచుకో వచ్చు." అని పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు.

అదంతా తనమీదేనని పార్వతికి తెలుసు, లోపల్లోపల ఉడుక్కున్నది. ఇదంతా వాడు తనభార్యను సమర్థించటానికే అంటున్నాడని పార్వతి నమ్మకం. ఎందుచేత నంటే, నారాయణ ఒకప్పుడు - అంటే అయిదారేళ్ళవాడై ఉండగా - కాస్త జబ్బుచేస్తే చాలు, తల్లిని తన మంచానికి కట్టేసుకుని, రెండునిముషాలు అవతలికి వెళ్ళితేచాలు, చెప్పివెళ్ళినాసరే, "అమ్మా, అమ్మా! ఎంతసేపటికీ రావేం?" అని కేకలుపెట్టేవాడు. తన కొడుకింకా అట్లాగే ఉన్నాడని పార్వతికి భ్రమలేదుగాని, అట్లాగే ఉండకపోవటం వాడి తప్పేననీ, వాడిలా మారటానికి చాలావరకు కారణం తన కోడలేననీ నమ్మకంమటుకున్నది.

సంఘంలో వర్గాలమధ్య ఉండే గోడలను పోలినవి తరాలమధ్యకూడా ఉంటాయి. పై తరంవాళ్ళు కిందితరంవాళ్ళను అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తారుగాని, ఆ ప్రయత్నం ఫలించదు. కింది తరంవాళ్ళు పై తరాలను అర్థం చేసుకునేటందుకు చెప్పుకోదగిన ప్రయత్నం చెయ్యరు. అది వాళ్ళకే చాలా అవసరంగా తోస్తుంది. కాలం ఎప్పుడూ ముందుకే పోవటం అందుకు కారణం కావచ్చు.

అయినా చిన్నవాళ్ళు కాలానికి ఎదురీదవలిసిన అవసరం ఉన్నది. పార్వతి మనస్సు ఎట్లా పనిచేసేదీ అర్థం చేసుకుని నారాయణ విసుక్కునేవాడే గాని, తను దూరమయాక ఆవిడ జీవితంలో ఎంత ఒంటరితనం అనుభవిస్తున్నదో అర్థం చేసుకోలేదు.

దానికి ఒకకారణం నారాయణమనస్సు సాధకుడు కావటంమీద లగ్నమైయున్నది. ఏకళ సాధనచేసేవాడైనా ఒకేసారి రెండు ప్రపంచాలలో జీవించాలి. వాస్తవ ప్రపంచాన్ని వదులుకుంటే కళాసాధన నేల విడిచిన సాము అవుతుంది; కళలో నిమగ్నుడవుతూ ఉండకపోతే అది స్వాధీనానికి రాదు. ఈ రెండు ప్రపంచాలలో ఏ ఒకదానిలోనూ పార్వతికి తగిన స్థానం లేకపోవటం ఆమె ప్రారబ్ధం.

[ముగింపు వచ్చే సంచికలో]

# ఆప్త మిత్రులు

**తాళ్లూరి నాగేశ్వరరావు**



భూషయ్యా, భుజంగరావూ ఆప్త మిత్రులు. ఇద్దరిదీ ఒకేఊరు. వారిది ఇరుగూ పొరుగూ కాకపోయినా, వాళ్ళ స్నేహాన్ని గట్టిపర్చింది తుమ్మ గుంట పొలం. అక్కడ గట్టు హద్దుగా చెరి మూడెకరాల శేరీ మాగాణిభూమి ఉంది. ఇద్దరూ వ్యవసాయదారులే. ఊడ్పుల దగ్గర్నుంచీ మాసూలువరకూ ఇద్దరూ చేదోడు వాదోడుగా సేద్యపు పనుల్ని చేసుకుంటూవుంటారు. వాళ్ళ సఖ్యతా, స్నేహమూ అక్కడే ఆరంభ మైంది. ఆయేటికాయేడు అది కొమ్మలూ రెమ్మలూవలె వృద్ధిచెందింది. ఒకతల్లి బిడ్డలు కాకపోయినా, అంతకు మరింత యిదిగా అన్నదమ్ములవలె మెలుగుతూ ఉంటారు.

భూషయ్యకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు ఇంజనీరింగ్ ఫైనల్ యియర్ చదువుతున్నాడు రెండోవాడు మెడిసిన్. పెద్దవాడు పెళ్ళీడు కొచ్చాడు.

భుజంగరావుకు ముగ్గురు కొడుకులు. పెద్దవాడు ఇంజనీరింగ్ ఫైనలుయియర్ చదువుతున్నాడు. రెండోవాడు మెడిసిన్. మూడోవాడు పి. యు. సి. పెద్దవాడు పెళ్ళివయస్సులోనే ఉన్నాడు.

భుజంగరావుకంటె భూషయ్యే స్థిర చరాస్తులలో మిన్న. భూషయ్యకంటె భుజంగరావు ఓ మోతాదు ఎక్కువ వ్యవహారదక్షత గలవాడు. భూషయ్య చదువు వీధిబడి దాటలేదు. భుజంగరావు సర్కారువారి బడిలోకూడా రెండేళ్ళు చదువుకున్నాడు.

మిత్రులిద్దరూ తమతమ పెద్దకొడుకుల్ని ఓ ఇంటివాళ్ళని ఆయేడు చేయాలని ఉవ్విళ్లూరుతున్నారు.

ఆరోజు కడసంజెవేళ మిత్రులిద్దరూ తుమ్మగుంటపొలం దగ్గర్నుంచి ఊళ్లోకి వస్తున్నారు.

"భూషయ్యా: పాలెం మున్సబు నీకు ఎరుకగదూ! ఆయనకు పెళ్ళీడు కొచ్చిన ఓ పిల్ల ఉంది. పుత్తడిబొమ్మ. కట్నంకూడా 'ల'కారంమీదే! గుంటూరులో స్త్రీల కళాశాలలో బి. ఏ. మూడో సంవత్సరం చదువుతూన్నదట. గుణవతీ, రూపవతీ, విద్యావతీ; ఆ పైన ధనలక్ష్మి - ఆ పిల్లను మా పెద్దవాడికి ఇస్తామంటూ మున్సబు కబురుచేశాడు," అన్నాడు భుజంగరావు తాపీగా.

"ఏమన్నావ్?" అన్నాడు భూషయ్య ఆదుర్దాగా.

"అక్కర్లేదన్నాను," అన్నాడు భుజంగరావు పట్టు కత్తిరించినట్టు.

భూషయ్యకు గుటక పడలేదు. "ఏం?"

"అక్కడే ఉంది అసలు కిటుకు. అందరూ నన్ను పిచ్చివాడిక్రింద జమ కడతారు. నిజం తెలుసుకుంటే నన్నే వ్యవహారజ్ఞాని అంటారు. మా బావమర్ది అంతా వాకబు చేసి, నా చెవిలో అసలు రహస్యాన్ని వూదాడు. ఆ పిల్ల జాతకంలో పెళ్ళిఅయిన అయిదేళ్ళకు వైధవ్యం వ్రాసిపెట్టబడి ఉందట. అంటే ఆ జాతకప్రభావంవల్ల ఆమెను కట్టుకున్న మొగుడు అయిదేళ్ళల్లో 'హరీ' అనవల్సిందేగదా! చూస్తూ చూస్తూ ఆ సంబంధము చేసి ఏ తండ్రి తన కొడుకుమరణాన్ని కోరుకుంటాడు? ఏమంటావు భూషయ్యా?" కనుబొమ్మలు ఎగురవేస్తూ అన్నాడు భుజంగరావు.

భూషయ్యకు గుటక పడింది. "అవును, మరి అంతే!"

ఆ మిత్రులిద్దరిమధ్యా ఆ సంభాషణ జరిగిన వారం రోజులకు భూషయ్య ఇంటికి పాలెం మున్సబు దగ్గర్నుంచి ఓ పెళ్ళిళ్ళపేరయ్య వచ్చాడు. మున్సబుగారు తమ అమ్మాయిని లక్షరూపాయల కట్నంతో ఇంజనీరింగ్‌చదివే భూషయ్యగారి పెద్దబ్బాయికి ఇవ్వడానికి సిద్ధంగా వున్నట్టు తెలియబర్చాడు. భూషయ్యకు వెన్నుపాము విరిగినట్లై, ససేమిరా ఆ సంబంధం తమకొద్దని మొహంపై పేడనీళ్ళు చల్లినట్టుగా చెప్పాడు. పాపం! ఆ పెళ్ళిళ్ళ పేరయ్యకు నిలువునా నడుములు క్రుంగగా, కాళ్ళీడ్చుకుంటూ భుజంగరావు దగ్గర కెళ్ళి, ఓ గంటసేపు ముచ్చట్లు ఆడాడు. ఆ పిమ్మట పాలెం వెళ్లాడు.



ఓ నెల రోజుల తర్వాత పాలెం మున్సబు కూతురికీ భుజంగరావు పెద్ద అబ్బాయికీ పెద్దల సమక్షాన వైభవంగా వివాహం జరిగింది.

తలవాకిటి చావడి దూలం నుదురుకు కొట్టుకున్నంతగా దిమ్మరపోయాడు భూషయ్య.

"ఏమిటి భుజంగరావ్! ఆ పిల్ల జాతకంలో పెళ్ళి అయిన ఆయిదేళ్ళకు వైధవ్యం ఉందని నాతో అన్నావ్. మరి చూస్తూ చూస్తూ నీ కొడుక్కి చేసుకున్నావేం?"

తన మిత్రుని అమాయకత్వానికి భుజంగరావు చిక్కగా చిరునవ్వు నవ్వాడు.

"అదేమో నాకు వివరంగా తెలియదు. మా వాడి జాతకాన్ని తిరగవేశాను. వాడికి పెళ్ళిఅయిన అయిదేళ్ళకే ద్వితీయ వివాహ మున్నట్టు ఖచ్చితంగా ఉంది."

భూషయ్యకు నో రెండిపోయింది.

——




ప్రియమైన శ్యామలగారికి ...

మీ వుత్తరాలన్నీ అందుతోనే వున్నాయి. మొన్న మీరు పంపిన ఫోటో కూడా అందింది. ఈ వుత్తరంతో తిరిగి పంపిస్తున్నాను. అమ్మాయి ఎంతో అందంగా వుంది. మిగతా వివరాలన్నీ మీరు రాశారు. వాటిని నేను శంకించటం లేదు. నేను ఇష్టపడితే వాళ్ళకి చెప్తానని రాశారు. తొందరపడి అలామాత్రం చెయ్యకండి. నన్ను అర్థం చేసుకుంటారనే విశ్వాసంతో రాస్తున్నాను.

నా మనస్సేమిటో నాకే అంతు చిక్కటములేదు. పెళ్ళి చేసుకోవాలనే కోరిక రోజురోజుకీ గాఢంగా బలపడుతోంది. రోజులు వ్యర్థంగా పోతున్నాయేమో నన్న దిగులుకూడా పట్టుకుంది. నవ్వకండి. నా కో జత కావాలని మనసు కలలు కంటోంది. తోడు తెచ్చుకొని గూడు కట్టుకోవాలని హృదయం వువ్విళ్ళూరుతోంది. చూశారా? కాబోయే శ్రీమతిని తల్చుకుంటే ఎలా కవిత్వం పుడుతోందో! అందుకని పెళ్ళిమీదా - దాని విలువమీదా మీరు వేరే వుపన్యాసా లివ్వనవసరంలేదు. 'ఏ అమ్మాయీ నీకు నచ్చదా? నువ్వేం వీరుడివా? శూరుడివా? మన్మథుడివా? నలకూబరుడివా? జమీందారువా? మహారాజువా?' అని మీరు నిలదీసి అడుగుతారేమో! నిజం చెప్పనా? ఈ ప్రశ్నలన్నీ నన్ను నేనే అడిగేస్తున్నాను - నాలో శివుడు ఏం జవాబు చెప్తున్నాడో విన్నారా? - 'నేను మనిషిని. నాకు మనసుంది. అది తృప్తిపడకుండా నేను ఏదీ నిర్ణయించుకోను.' అంటున్నాడు. చూశారా వాడి బడాయి?

శ్యామలగారూ! ఇదండీ కథ.

నన్నేం చెయ్యమంటారు? ఇందులో నా తప్పేమైనా వుందా? ఉంటే చివాట్లు పెట్టండి. కిక్కురుమనకుండా తింటాను. నామీద కరుణించి మీరు ప్రస్తుతానికి పిల్లని చూసే ప్రయత్నం విరమించుకోండి. నన్ను అపార్థం చేసుకోరుగా?

అన్నట్టు ఈమధ్య మాలతి చాలా మారినట్టు కన్పిస్తోంది. వాళ్ళ బావ కబుర్లు చెప్పినా దిగులుతో కృంగిపోకుండా – గడిచిపోయిన మధురస్మృతులు నెమరు వేసుకుంటోన్న తన్మయత్వంతో– బావపట్ల ఆరాధనతో, ప్రేమతో – నిర్వికారంగా మాట్లాడుతోంది. ఆ మధ్య మాలతి నాకో పెద్దవుత్తరం రాసిన విషయము మీకు రాశాను కదూ? అప్పటి నుంచే మాలతి ఇలా మారినట్టు భావిస్తున్నాను నేను. ఒక్కోసారి ఆ అమ్మాయిని చూస్తూంటే ఎందుకో చెప్పలేని భయం వేస్తుంది నాకు. రాగద్వేషాలకు అతీతమైపోవటం అంటారే ... అలా కొన్నాళ్ళకి విరాగిణిగా ఐపోతుందేమో అన్పిస్తుంది.

నిజం చెప్పాలంటే ... మాలతికన్న అలాంటి సౌందర్యరాశినీ – అంత హృదయపూర్వకంగా ప్రేమించే భార్యనీ శాశ్వతంగా వదిలి వెళ్ళిపోయినవాడే ఎక్కువ దౌర్భాగ్యుడు. కాదంటారా? మధురానుభూతుల్నికూడా క్షణంలో మర్చిపోయే తత్వం మనిషిది. ఒకనాడెంత సుఖించినా అది మాసిపోగానే నిశ్చింతగా మరోసుఖాన్ని వెదుక్కునే స్వార్థం మనిషిది – ఈ రెండూ చేతకావు మాలతికి. ఆమె హృదయఫలకంమీద పడిన ముద్ర చెరగనే చెరగదు. ఆలయంలో భగవంతుడి ప్రతిమలాగ ఆ రూపు కంటికి కనిపించని పూజ లందుకొంటూ వుంటుంది. అంత భాగ్యం ఎంతటి వాళ్ళకి! అణువణువునా అందమూ – హృదయ సౌకుమార్యమూ కలబోసి మలిచాడేమో సృష్టికర్త మాలతిని ... ఇవ్వాళ వుత్తరంనిండా కవిత్వం చెప్పి మిమ్మల్ని విసిగించేస్తున్నాను; ఏదో రాయాలని మరేదో రాశాను.

దారిలో పడుతున్నాలెండి.

అన్నట్టు మొన్న మా బార్ మీటింగులో నే నో చిన్ని వుపన్యాసం యిచ్చాసుమండీ!

'ప్రజా స్వామ్యంలో న్యాయవాది,' అనే తలకట్టుపెట్టి మా సీనియర్ చెప్పిందానికి నా అభిప్రాయాలు మేళవించి ఓ రాత్రంతా కూర్చుని ఇరవై కాయితాలు చించి – పదిపేజీలు రాశాను; రెండు రోజులు దాన్ని కంఠతాపట్టాను; ఓ ముహూర్తాన అనర్గళంగా మాట్లాడేశాను. మావాళ్ళంతా ఓహో! అంటే ఓహో! అన్నారు. తర్కవితర్కాలు చేశారు. నా వుత్సాహంలో యిన్నిసీళ్ళు పొయ్యకుండా మెచ్చుకుని వదిలేశారు.

శ్యామలగారూ! నేను 'లా' చదవాలని అనుకున్నప్పుడు మీతో వాదం పెట్టుకున్నాను గుర్తుందా! న్యాయవాదినై లోకంలో ఎక్కడా అన్యాయం జరక్కుండా చేస్తాననీ – సంఘంలో కుళ్ళంతా కడిగేస్తాననీ – మానవుడిలో దాక్కున్న దానవత్వాన్ని హతమార్చేస్తాననీ ... ఇంకా ఏమిటేమిటో అన్నాను.

కట్టలు తెంచుకుంటోన్న ఆవేశలుంతో వుద్వేగంతో—మిమ్మల్ని మారుమాటాడ నివ్వకుండా చేశాను

కానీ నేను అనుభరవహితంగా మాట్లాడానని—యిప్పుడు ఒప్పేసుకుం టాను.

ఏ వ్యక్తికానీ—ఏ వృత్తిలో వుండనీ—ఎంత ఆదర్శంగా బ్రతకనీ—అతను చెయ్యగలిగింది తన చేతిలో వున్నంత వరకే. అలాగే లాయ రనేవా డెవడైనా ప్రోనోట్లమీద డబ్బు వసూలు చెయ్య గలడు. పెరటి జాగా తగాదా లొస్తే హోరా హోరీ వాదించగలడు. అరటిచె ట్టెవరి కెళ్తుందో—ములగమొ క్కెవరి కొస్తుందో తర్కించగలడు. యాక్సిడెం టయితే నష్టపరిహారం యిప్పించగలడు. ఇలాగే పెద్దచిన్న తారతమ్యం—అంతస్థుల భేదం తప్పితే—దీనికిమించి చేయగలిగిం దేమీలేదు.

మనుషుల తత్వాలు మార్చలేడు. వ్యక్తిత్వాలు మార్చలేడు. సంస్కారాన్ని పంచలేడు. దేవుళ్ళని చెయ్యలేడు. ఒక అన్యాయాన్ని అరికట్టే శక్తి ఏ మానవ మాత్రుడికీ లేదు.

ప్రతీమనిషికీ మనిషిలా బ్రతకాలనే తపన పుట్టాలి. ఎవరికివారే ధర్మానికీ—న్యాయానికీ కట్టుపడాలి. మానవత్వం లోని సుఖాన్నీ—ఆనందాన్నీ—గర్వాన్నీ—తృప్తినీ—అనుభవించాలి. మనుషుల్లో నాకు ఎప్పుడూ నమ్మకం వుంది. ఈ నమ్మకంతో మనిషిలా బ్రతకాలనే కోరిక తప్పితే ఏమీలేదు.

స్నేహితుడు,
శంకరం.

* * *

మాలతి ఫోటో ఆల్బమ్ చూసు కుంటూ ఒక్కతీ గదిలో కూర్చుంది. పెళ్ళిలో తీసిన ఫొటోలూ—తిరుపతిలో తీసిన ఫొటోలూ ఎక్కువ వున్నాయి. రామం ఆప్తమిత్రుల ఫొటోలుకూడా కొన్ని వున్నాయి.

మాలతి మళ్ళా మొదటిపేజీ తీసి రామం ఫొటో తదేకంగా చూస్తూ కూర్చుంది. రామం జుత్తు కొంచెం నొక్కు; రేగితే అందంగా కన్పిస్తుంది. మొహం గుండ్రం; కళ్ళు కొంచెం చిన్నవి; నవ్వితే మరీ చిన్నవవుతాయి. ముక్కు ఎత్తు; గర్వంగా నిలబడ్డట్టుం టుంది. గడ్డం నున్నగా...అందంగా... చిరునవ్వు నవ్వుతూ ... మాలతి కళ్ళ లోకి గుచ్చి చూస్తున్నాడు రామం

"బావా!" అప్రయత్నంగా...

మాలతి ఆల్బమ్ గుండెలకి హత్తు కుంది. కన్నీటిబొట్లు జలజలా రాలి పడ్డాయి. వూరుతోన్న కన్నీళ్ళతో మళ్ళా రామాన్ని చూస్తూ కూర్చుంది.

"బావా! ఎక్కడికెళ్ళిపోయావు? నీ దారిన నువ్వు వెళ్ళావు. నే నేమైపోతా ననుకున్నావు?"—

మూగచూపులు చూస్తోంటే మనసులో

మాటలు పుట్టుకొచ్చాయి— "నువ్వు లేక నెలలూ సంవత్సరాలూ గడిచి పోతు న్నాయి. నే నిలా నిర్విచారంగా బ్రతికే వున్నాను. నీకు విడ్డూరంగా లేదూ? నువ్వు ఎక్కడి కెళ్ళిపోయావో నేనూ అక్కడికే రావాలని ఎన్నోసార్లు ప్రయత్నించాను బావా! నన్ను నమ్ము. నాకు దేవుడు దీర్ఘాయుష్షు పోశాడు ఇంకా ఈ బ్రతుకు ఎంత భారమో – ఎంత అనంతమో ... నువ్వు లేకుండా ఇదెలా గడుస్తుందో నా కేమీ అంతు చిక్కటంలేదు బావా! నువ్వు భౌతికంగా నా దగ్గర లేకపోయినా అసలు ఎక్కడైనా ఏ లోకంలోనైనా వున్నావా? ఎక్కడా లేకుండా ఏమైపోయావు? నీ చదువు – నీ తెలివితేటలు .. నీ ఆదర్శాలు ... నీ ఔన్నత్యం అన్నీ ఏమై పోయాయి?...

నిజం చెప్పనా? నువ్వు ఎక్కడో... ఎలాగో వున్నావని నా కెందుకో నమ్మకంగా వుంది గుడ్డివాళ్ళు జ్యోతిని చూస్తున్నామని భ్రమించే నమ్మకమా యిది?...ఎవ రేమనుకున్నా సరే నువ్వు వున్నావు; ఎక్కడోకాదు, నా మనసు నిండా నిండివున్నావు. నా అణువణువు లోనూ కదులుతున్నావు. నిన్ను నా చేతుల్లో బంధించుకోలేకపోయాను. నా గుండెల్లో దాచుకున్నది మాత్రం పోగొట్టుకోను. బావా! నువ్వు ఎన్ని జన్మ లెత్తినా నీ మాలతిని మర్చిపోవు కదూ? నేనూ అంతే.''—

మాలతి కంపిస్తున్న పెదవులతో రాము ఫొటో ముద్దుపెట్టుకుంది. దుఃఖానికి బదులుగా గాఢానురక్తి – ఒక దివ్యానుభూతి కలిగింది. ఫొటో ఒడిలో పెట్టుకుని వెనక్కి వాలి కళ్ళు మూసుకు కూర్చుంది.

"అత్తా! అత్తా! చుట్టా లొచ్చారు!" అరుస్తూ గాలిదుమారంలా గదిలో కొచ్చాడు, మాలతి మేనల్లుడు హరి నవ్వుతూ.

హరి వెనకాలే శంకరం వచ్చి గుమ్మంలో నిలబడ్డాడు.

మాలతి కంగారుగా లేచి ఒళ్లో ఫొటో ఆల్బమ్‌మీద పెడుతూ అంది – "రండి; ఫర్వాలేదు, రండి."

"అలా వున్నారేం?" అంటూ దగ్గిరికి వచ్చాడు శంకరం.మాలతి మాట్లాడ లేదు. హరిని దగ్గిరికి తీసుకుని కాలర్ సర్దింది. గుండీలు వూడదీసి పెట్టింది. ఎందుకో వాడికి సిగ్గేసింది – "ఆడుకుంటాను," అంటూ పరిగెత్తాడు.

"ఫొటో ఆల్బమ్‌లా వుందే! నేను చూడవచ్చునా?" అన్నాడు, శంకరం, కుర్చీలో కూర్చుంటూ.

"చూడండి," అంటూ ఆల్బమ్ అందించింది.

ఆల్బమ్‌మీద వున్న ఫొటో తీశాడు శంకరం. ఎవ రని అడగబోయి మానే

శాడు _ రామం ఫొటోలు కొన్ని చూసే వున్నాడు; పోలికలు స్పష్టంగా తెలుస్తున్నాయి. మాలతి ఎందుకంత దిగులుగా కూర్చుందోకూడా అర్థమైంది.

మొదటి పేజీ తిప్పాడు. పేజీనిండా వుంది పెళ్ళిఫోటో _ శంకరం కుతూహలంగా శ్రద్ధగా చూశాడు. మాలతి... మాలతే పెళ్ళికూతురు. బుగ్గన చుక్కా, కళ్యాణంబొట్టూ _ నిగనిగ మెరుస్తున్నాయి. మోకాలిమీదికి మొహం ఆన్చుకుని _ కనుకొలకుల్లోంచి చూస్తూ _ మూతి బిగించి, కళ్ళతో నవ్వుతూ కూర్చునుంది. మొహంలో కొంచెం అమాయకత్వం _ చిన్నతనం _ కన్పిస్తోంది.

పెళ్ళికొడుకు రామం కళ్ళు చిన్నవై పోయేలా నవ్వుతున్నాడు. రెండు చేతులతో మంగళసూత్రాలు పట్టుకున్నాడు. ఇద్దరు పురోహితులు చేతుల్లో అక్షింతలు పట్టుకుని_కళ్ళు చిట్లించి మంత్రాలు చదువుతూ నోళ్ళు తెరిచివున్నారు.

పెళ్ళిపెద్దలూ పేరంటాళ్ళూ _ పెళ్ళి పందిరీ _ అన్నీ చాలావరకు కన్పిస్తున్నాయి.

పేజీ తిప్పాడు శంకరం.

మాలతీ రామం పూలచండలతో నించునివున్నారు. రామం ఎడంచేయి కన్పించకుండా మాలతి రామాన్ని అంటిపెట్టుకుని నించుంది. రామం చేయి మాలతి జడమీదుగా వేసి పైటవేసుకున్న భుజాన్ని పట్టుకున్నాడు. మాలతి సిగ్గుతో మొగ్గ అయి ముడుచుకుని నించుంది. మొహాన్న గుండ్రటి బొట్టు వుంది.

మరోపేజీ తిప్పాడు శంకరం.

మాలతి జడ ముందుకు వేసి సగం అల్లిన జడ అల్లుకుంటోంది, నవ్వుతూ. జరీఅంచు నల్లచీర కట్టుకుంది.

మరోఫొటో _ ఎక్కడో మంచి చెట్ల మధ్య కొండల్లో తీసినట్టుంది.

చుట్టూ విశాలంగా పెద్ద పెద్ద చెట్లున్నాయి. ఆకాశం ఎంతో దగ్గిరిగా పెద్ద పెద్ద మబ్బులతో కన్పిస్తోంది, అక్కడక్కడా పక్షులేవో ఎగురుతున్నాయి.

మాలతి మొహం పైకెత్తి నవ్వుతూ ఆకాశంలోకి చూస్తోంది. రామం మాలతి భుజంమీద చెయ్యివేసి కుడిచేయి చాచి చూపుడువేలుతో ఏదో చూపిస్తున్నాడు.

మాలతి చిన్న చిన్న పువ్వులచీర కట్టుకునివుంది. మొహాన్న దోసగింజలాటి బొట్టు వుంది. తలలో పువ్వులున్నాయి. అంత ఆహ్లాదకరమైన ప్రకృతిలో పరవశిస్తోన్న ఆ జంటని చాలాసేపు చూశాడు శంకరం _ వున్నట్టుండి _

"ఇదెక్కడ తీశారు ?" అన్నాడు.

మాలతి ఆల్బమ్ అందుకుంది. ఫోటో చూసింది. ఫోటోనీ శంకరాన్నీ మార్చి చూసింది. ఆల్బమ్ అందిస్తూ అంది _ "తిరుపతిలో...... మా బావ ఫ్రెండు తీశాడు."




"ఆయి నలా చెయ్యెత్తి చూపిస్తున్న రేమిటి ?''

"ఏదో రంగురంగుల పక్షి ... చాలా అందంగా వుందట _ మా మీదనుంచి ఎగురుతూ వెళ్ళిందట. నేను చూడనే లేదు. అది దూరంగా చెట్టుమీద వాలిందని చూడమంటే ఆ కంగారులో చెప్పిందేవిటో అర్ధంగాక నేను ఆకాశంలోకి చూస్తున్నాను. కాస్సేపటికి కన్పించింది చెట్టుకొమ్మమీద."

శంకరం మరోపేజీ తిప్పాడు. అది కలర్ ఫొటో. మాలతి ప్రబంధనాయకిలా కట్టూబొట్టూ నించున్నతీరూ అంతా విచిత్రంగా వుంది. వెడల్పు జరీఅంచు పట్టుచీర బిళ్ళకుచ్చెళ్ళతో వెనక్కి గోచీ పోసి కట్టింది. కొంతజుత్తు మెడమీదికి దిగజారేలా పెద్దసిగ చుట్టింది. చక్రంలా పువ్వులు అలంకరించుకొంది. చేతులకు నిండుగా గాజు లున్నాయి. ఎదర చీరజరీ అంచు పాదాలమీద జీరాడుతోంది. చేతిలో తెల్లటి కలవపువ్వు పట్టుకొని దానితో సంభాషిస్తోన్నదానిలా చెక్కిలికి ఆనించుకుని తన్మయత్వం చెందుతూ అర మోడ్పు కన్నులతో పరిసరాల్ని మత్తుగా చూస్తూ పయ్యారంగా నిలబడివుంది.

శంకరం చాలా సేపు ఆ ఫోటోనే విస్మయంగా చూశాడు. మాలతి అపురూప సౌందర్యంతో అద్భుతంగా వుంది. ఎంత చూసినా తనివితీరనంత మనోహరంగా వుంది. ఎదరగా దిగులుగా వున్న

మాలతినీ, ఫొటోలో రంభలావున్న మాలతినీ మార్చిమార్చి చూశాడు.

"ఈ ఫొటో ... ఏదైనా డ్రామాలో సీనా? కాలేజీ ఫంక్షన్స్‌లో..."

అబ్బే! అదేం కాదండీ!" మాలతి కొంచెం నవ్వింది - "ఏదో హిందీ పత్రిక్కి పంపించాలని మాబావ ఎంత చెప్పినా వినకుండా స్టుడియోకి తీసి కెళ్ళి మేకప్ చేయించి తీయించాడు. అలా నించోటం చేతగాక అరగంట సేపు కాల్చుకుతిన్నాడు."

శంకరం మళ్ళా ఫొటో చూసి - మాలతి మొహంలోకి గుచ్చిచూస్తూ - అన్నాడు - "ఈ ఆల్బమ్ ఎప్పుడూ నాకు చూపించలేదేం?"

"ఇన్నాళ్ళూ మా యింట్లోలేదు. ఎన్నో వుత్తరాలు రాస్తే మొన్నే మా అత్త పంపించింది."

శంకరం మిగతా ఫొటోలుకూడా చూస్తూ కూర్చున్నాడు. మాలతితల్లి గది లోకి వచ్చి ఏదో వస్తువు తీసికెళ్ళింది. మాలతి వదిన గుమ్మంలో నిలబడి మాల తితో మాట్లాడి వెళ్ళింది. ఏదీ గమనించ లేదు శంకరం. తనకి నచ్చినవన్నీ మళ్ళీ మళ్ళీ చూడటంలో మునిగిపోయాడు. చాలా సేపు మాలతి అంటే ఏమిటో, ఎలా వుంటుందో అప్పుడే అర్థమైంది బాగా. మాలతిలో ఎన్నో అందా లున్నాయి, ఎంతో సౌందర్యం వుంది. ఒక్కో-సింగా రంలో ఒక్కో-రూపం దాగివుంది. ఒక్కో-రూపంలో ఒక్కో-అనుభూతి నిండివుంది. బహుముఖ సౌందర్యవతి మాలతి. ఇంత నిర్వికారంగా ఇంత విరాగిణిలా జీవిత మంతా గడిపేస్తుందా?

ఈ మాలతి మళ్ళా ఎప్పటిలా - మన సారా నవ్వుతూ - తుళ్ళుతూ - బంగారం బొమ్మలా సింగారించుకుని కళకళ లాడుతూ...ఏం? అలా వుండకూడదా?

—— మాలతి లేచి దువ్వెన తెచ్చుకుని జుట్టు విప్పుకుంది. నిగనిగలాడుతూ జుట్టు ఒత్తుగా రెండుభుజాలు కప్పింది.

శంకరం ఆల్బమ్ తెరిచింది తెరిచి నట్టే టేబుల్‌మీద పెడుతూ మాలతిని చనువుగా చూశాడు - "అప్పటికీ ఇప్ప టికీ మీకు పోలిక లేనంత ఆశ్చర్యంగా వుంది. అప్పుడు కళ్ళల్లో ఏదోకాంతి వుంది. మొహంలో ఎంతో కళ వుంది. రంగుచీర కట్టుకుని బొట్టు పెట్టుకుంటే నమ్మలేనంత మార్పు కన్పిస్తోంది," అన్నాడు.

"మార్పు కాకపోతే ఏం కన్పిస్తుంది? అప్పటి పరిస్థితంతా ఇప్పుడు తల్ల క్రిందులైపోయింది. మీరే చూస్తున్నారు కదా? ఇద్దరం కలిసి అన్ని విధాలుగా వున్నాం. అంత సంతోషంగా గడిపాం. ఇప్పుడు ... తను ... లేదు; నేను వున్నాను."

"కొన్నాళ్ళకి మీరూ వుండరు, నేనూ వుండను. ఆ సంగతి తెలుసా?" ప్రశ్నార్థకంగా చూశాడు శంకరం- "మనిషి ప్రకృతి నెదిరించగల డంటారా?"

"ఎదిరించలేమని - ఎంత దారుణాలు జరిగినా మనసారా ఆమోదించగలమా?" నిష్ఠూరంగా చూసింది మాలతి.

"మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు లోకధర్మం కొంతైనా అర్థం చేసుకోవాలంటున్నాను నేను సుఖాలూ దుఃఖాలూ ఎదురయ్యేది మనిషికే. దేని అనుభూతి దానికి వుంది; దేని విలువ దానికి వుంది. దుఃఖంలో - కష్టంలో కూడా సుఖం వెదుక్కోవచ్చు; తృప్తి కల్గించుకోవచ్చు. అలాంటివ్యక్తి పరిపూర్ణతతో బ్రతుకుతాడు. పిచ్చివేదాంతం చెప్తున్నాననుకోకండి. నా అనుభవాలు నాకీ అభిప్రాయం కల్గించాయి."

మాలతి అరచేతులమధ్య మొహం అన్చుకుని మౌనంగా కూర్చుంది.

శంకరం ఆత్మీయత వుట్టిపడే కంఠంతో మృదువుగా అన్నాడు - "కష్టాలు తట్టుకుంటూ విచారిస్తూ కూర్చోవటం వివేకం అవదు. మానసిక బలంతో ఎంత క్లిష్టపరిస్థితైనా లొంగదీసుకోవచ్చు; మార్పు తెచ్చుకుందామనే కోరిక మాత్రం వుండాలి."

"మార్పే యిష్టం లేకపోతే?".

"మూర్ఖత్వం అవుతుంది మూర్ఖుల్ని చూస్తే సానుభూతి కలగదు."

మాలతి మాట్లాడలేదు.

శంకరం కొంచెం ముందుకు ఒంగి, మాలతిని ప్రేమగా చూస్తూ అన్నాడు - "మీ గురించి నాకు తెలిసినంతకూడా మీకు తెలీదు. మీలాంటి వ్యక్తులు ప్రేమానురాగాలకి దూరంగా బ్రతకలేరు. వాటికి తప్పితే జీవితంలో దేనికీ ప్రాధాన్యం యివ్వరు. అందుకే మీరంటే నాకు ఇంత ఇష్టం. జరిగిందంతా ఒక మధుర స్వప్నం అనుకోండి. దాన్ని అలాగే వుంచుకోండి. మీరు మళ్ళా పెళ్ళి చేసుకోండి."

చటుక్కున తల ఎత్తింది మాలతి. శంకరం మొహంలోకి సూటిగా చూస్తూ అంది-"ఎవర్ని? మిమ్మల్నా?"

తెల్లబోయాడు శంకరం - నిర్ఘాంతపోయాడు శంకరం. మాలతిని దీక్షగా చూడబోయాడు.

మాలతి తల ఒంచేసుకుంది. అనరాని మాట అన్నంత భీతితో ముడుచుకుపోయింది. విప్పివున్న జుట్టు మాలతి మొహాన్ని చాలావరకు దాచేసింది.

శంకరం సంభ్రమంగా మాలతిని చూశాడు - మొహంనిండా మందహాసం చిందులాడింది. లేచి నిలబడ్డాడు - మాలతికి కొంచెం దగ్గిరికి వెళ్ళాడు. అనునయంగా అన్నాడు: - "మీ బావకు ఇచ్చినంత పవిత్రమైన స్థానం ఎవ్వరికివ్వగలిగితే వాళ్ళని చేసుకోండి."

మాలతి తనువంతా కంపించసాగింది. మనసు ఆలోచనాహీనమై మూగబోయింది. శిలాప్రతిమలా చైతన్యరహితంగా కూర్చుంది.

"మాలతీ! నా మాటలు మీకేమైనా కష్టం కలిగిస్తే క్షమించండి. మీరేం బాధ పడకండి; వెళ్తాను." అన్నాడు శంకరం. ఒక్క నిముషం నించుని కదిలాడు. (సశేషం)

# మల్లిక

కె. వివేకానంద మూర్తి



నాలుగేళ్ళయింది నా దేశం విడిచిపెట్టి—మళ్ళీ యిదే చూడ్డం.

స్టేషన్లో దిగాను. గోపన్న వచ్చాడు. సామాను తీసుకువెళ్ళి జట్కాలో వేశాడు; జట్కాదగ్గరికి వచ్చాను. ఒక్కసారి వూరంతా కలయచూశాను. యిదేనా అనుకు అనిపించింది; చాలా మారింది. నాలుగేళ్ళక్రితం నవ్వుతున్న నాలుగేళ్ళ పాపలా వుండేది — యిప్పుడు పమిట సర్దుకొంటున్న అమ్మాయిలా వుంది.

"ఎక్కండి బాబూ!" గోపన్న పిల్చాడు.

జట్కా ఎక్కాను. జట్కావాడు తోలుతుంటే గోపన్న పక్కన నడుస్తున్నాడు. గుర్రం నడుస్తోంది. చిన్నప్పుడు గుర్రాలు పరిగెడతాయని చదివాను, కానీ యిది నడిచేగుర్రంలా వుంది. గుడ్డిది కాకపోయినా దానా వున్నట్టు లేదు దీనికి. సినిమాలో యన్టీ. రామారావు గుర్రంలా వుంది. ఆలోచిస్తున్నాను — ఊరు వూరుకోలేదు. అందంగా అమ్మాయిలా పెరిగింది. గోపన్న కూతురు కూడా పెరిగివుంటుంది — వూరులాగే —




ఏపుగా, ఎంచక్కా, ఎలిజబెత్ టేలర్ లా_

"గోపన్నా!" పిలాచ్చను.

"బాబూ!"

"బావున్నావా ?"

"ఏదో మీ దయ బాబూ! కూతురికి పెళ్ళికూడా సేసేసినాను." కూతురిమీద ఆలోచన పసిగట్టినట్టు చెప్పాడు.

'అమ్మ పెధవా!' అనుకున్నాను.

"ఎవరితో ?" అన్నాను.

"ఆ డుత్త ఎదవ బాబూ! ఏలుకోడం మానేసి పట్నం ఎల్లిపోయాడు. ఎప్పుడో డబ్బుచ్చుకు తిరిగొత్తాట్ట — సన్నాసెదవ!"

గుర్రం తుమ్మింది.

గోపన్న అడిగాడు _ "మరి తవరి పెళ్లెప్పుడు, బాబూ!"

"నువ్వు చేస్తావా?" సగం నవ్వుతూ అన్నాను.

"ఎంతమాట బాబూ! ఎత్తుకు మోసి నోణ్ణి. తవరి పెళ్ళికి పల్లకీ మొయ్యాల్సింది నేనేగదు బాబూ!" గోపన్న భుజాలు వుత్సాహంగా వూగాయి. ఆ భుజాలమీద ఎన్ని పెళ్ళి పండగలు చేశాడో లెక్కలేదు. పవిత్రత బరువుతో అవి బలంగా పెరిగిన ట్టున్నాయి.

"బాబూ — పెదబాబుల పెళ్ళిల్లన్నీ యీ బుజాలమీదే సేశాను. మీ పెల్లి కూడా నా పల్లకీలోనే వూరేగాలి బాబూ — ఏటో! ఇప్పు డంతా మారిపోయింది. పల్లకీ లెక్కే పెబువులే లేరు. నాగరికతబాబూ, నాగరికత. నేనే ఏటో తాపత్రరీయం వదన్నేక నా పల్లకీ పట్టుకు ఏల్లాడుతున్నాను. మరి దానికి పెబువునీ, పనోన్నీ నేనేకదు బాబూ." గోపన్న కబుర్లు వింటున్నాను.

గోపన్న మా సరితాశ్రమంలో తోట మాలి. ఏళ్ళతరబడిగా అక్కడే వుంటున్నాడు. వాడికి పల్లకి ఒకటుంది. సరితాశ్రమంలో పెళ్ళిళ్ళన్నీ వాడి భుజాలమీదే జరగాలి — దారిలో సింగన్నకొట్లో సిగరెట్లు కొన్నాను.

యింటిదగ్గర జట్కా ఆగింది, దిగాను.

* * *

సాయింత్రం బాల్కనీలోకి వచ్చి చూశాను. చుట్టూరా ప్రహరీ — పురాతనంగా, బలిష్ఠంగా — గోపన్న భుజాల్లా, ఎత్తుగా, రక్షణలా — గోపన్నలా వుంది. పక్కనే 'గోస్తనది'కాలువ పారుతోంది. ఆవరణలో అరటిచెట్లు, సపోటాచెట్లు, దూరంగా బొగడచెట్టు — సరితాశ్రమానికి నేనొక్కణ్ణే అధిపతి నైనందుకు అర క్షణం గర్వపడ్డాను. అంతలో — బొగడ చెట్టు నీడలో గోపన్న వుండే ఔట్ హౌస్ ముందు వంగొని కనకాంబరం మొక్కకి నీళ్ళు పోస్తున్న గోపన్నకూతురు సీతాలు కనబడింది, అటువేపు తిరిగి. అటువేపు తిరిగిన అప్సరసలా వుంది. సరస కొస్తే బాగున్ననివుంది. 'సీతాలూ!' అని పిలిస్తే వింది. కాస్సేపటికల్లా వచ్చి మెట్లమీద ఆగింది.

"ఆ ఫ్లాస్కుతో కాఫీ తీసుకురా." చిల్లర యిచ్చాను. సీతాలు వెనక్కి తిరిగింది. అంచేత మెట్లు దిగేవరకూ చూశాను. గోపన్న వుత్తము డనిపించింది. నిజంగా గోపన్న మంచివాడైనా యిదివర కెప్పుడూ యిలా అనిపించలేదు — కాని యిప్పుడు — సీతాల్లాంటి కూతుర్ని కన్నందుకేమో!

గోపన్న చాలా పురాతనమైనవాడు. మా సరితాశ్రమమంత పురాతన మైనవాడు. ఊళ్ళో గోస్తనదంత పురాతన మైనవాడు. చరిత్రలా, నాగరికతలా పురాతనమైనవాడు. చరిత్రని శోధిస్తే చక్కని కథ లున్నట్టూ, పురాతన శిధిలాల్ని తవ్వితే పువ్వుల్లాంటి విగ్రహాలు



బయల్పడినట్టు, గోపన్న సంసారం చేస్తే గోపికంత అందంగా సీతాలు పుట్టినట్టూ ఉంది. అందానికి అంతస్తులూ, కులమత బేధాలూలేవు; పేద, గొప్ప తేడాల్లేవు. అన్యాయం, అవినీతి అక్కర్లేదు. ప్రభుత్వంలా కాక అందరూ మనుషులే నని షెడ్యూల్డుకి, ఫార్వర్డుకి కూడా సౌందర్యం స్కాలర్ షిప్పుగా యిస్తుంది. అందర్నీ సమానంగా పంచుకుంటోంది.

సీతాలు కాఫీ తెచ్చింది. వంగొని గ్లాసులో పోస్తోంది - యిందాక కనకాంబరం మొక్కకి నీళ్ళు పోస్తున్నట్టు. నేను కాఫీనీ చూడలేదు, సీతాల్నీ చూడలేదు, వంగొంటే వొంటి నగిషీల్ని చూశాను. మరి నేను మగాణ్ణి; నాతప్పుకాదు. గది పూడవమన్నాను. వంగొని చేసే వన్నెన్నీ చెప్పాలనివుంది.

కాఫీ త్రాగుతుండగా సీతాలు పని పూర్తిచేసి పెరట్లోకి వెళ్ళిపోయింది.

సాయంత్రం చినుకులు పడ్డాయి. బొగడపళ్ళురాలి మట్టిలోతడిసి తోటంతా సువాసనగావుంది. ఆకాశంనిండా యింకా మేఘాలు అటూ యిటూ తిరుగుతున్నాయ్ - త్వరగా వర్షమై నిన్ను చేరాలనివుంది అని - పెరట్లో సీతాల్ని ప్రేమిస్తున్నట్టు.

చీకటిపడింది.

భోంచేశాక గోపన్న పడుకోడానికి మేడమీది కొచ్చాడు. పెళ్ళికబుర్లూ, పల్లకీకబుర్లూ చెబుతుండగా పనిబడలిక

గోపన్న కళ్ళమీద నిద్ర మబ్బులు కప్పింది. వాటిమీద గోపన్న కంబళీ కప్పుకున్నాడు. వాడికి బాగా నిద్రపట్టింది.

నాకింకా నిద్ర రావడంలేదు. బాల్కనీ లోకి వచ్చాను. నిద్ర బాల్కనీలో వుంటుందని కాదు. ఒంటరితనం బాధిస్తోంది. పెరట్లో చెట్ల సందుల్లోంచి దూరంగా ప్రహరీదగ్గర బొగడచెట్టు నీడలో గోపన్న ఔట్‌హౌస్ మసగ్గా కనబడుతోంది. లోపల దీపంవెలుగు సన్నగా కదుల్తోంది. ఆవెలుగులో అటూ యిటూ కదిలిన సితాలి నీడని నేను గుర్తు పట్టాను – ఎత్తుగా ఎదిగిన సీతాలు మత్తుగా అనిపిస్తోంది. ఏవో ఆలోచనలు –

* * *

వొంటిమీది కిరణాల వెచ్చదనానికి వొళ్ళు తెలిసింది. లేచి విరుచుకున్నాను. బాల్కనీలోకి వచ్చాను గోపన్న యింటిదగ్గిర గోలగావుంది. జనం చాలా వున్నారు – ఏదో వుపద్రవం జరిగినట్టు. కాస్త కంగారుపడ్డాను. గబగబా ఆకు చెప్పులు తొడుక్కు నిక్రిందికి దిగి బొగడ చెట్టువేపు నడిచాను. దగ్గరికి వెళ్ళేసరికి సగంమంది పైగా తగ్గారు. మిగిలినవాళ్ళు పక్కకి తొలిగారు. తలెత్తిన గోపన్న తలమీద చేతులు వేసుకొని గోలెత్తాడు.

"బాబో! అయిపోయింది. నాబతుకు తెల్లారిపోయింది. సీతాలు బాబూ – నాకూతురు – కాలవలోపడి సచ్చి పోయింది బాబూ – గంగమ్మతల్లో –"

హఠాత్తుగా బొగడచెట్టు విరిగి నెత్తిన పడినట్టయింది నాకు. జాలిగాచూశాను. సానుభూతికి ప్రతినిధుల్లా చుట్టూ నలుగురు మనుషులు మాత్రం మిగిలారు. గోపన్న ఏడుపు నా కెప్పుడూ అలవాటులేదు. అది యింతలో ఆగేదికాదని తేల్చుకున్నాను. దెబ్బతిన్న హృదయంతో తల వొంచు కొని వెనక్కి తిరిగాను.

నా గదిలోకొచ్చాను. నా గదిలో కొచ్చినట్టులేదు; విషాదం తట్టుకోలేని మనసు విషణ్ణతతో వణుకుతోంది. అలాగే గడిపాను.

సాయంత్రమైనా నా వొంట్లో దీన త్వము తొలగలేదు; నా యింట్లో దీపాలూ వెలగలేదు; నా కంట్లో సీతాలు చెరగ లేదు. సరితాశ్రమంలో దీపంలా వెలిగిన సీతాలు ఆరిపోయింది. అవును, వెలిగే గుణంతోబాటు, ఆరిపోయే గుణంకూడా వుంది కాబట్టే దీపం అన్నారు.

రాత్రి –

నాకు నిద్రపట్టలేదు.

అంతరంగంలో ఆలోచనలు అస్త వ్యస్తంగా ఆక్రమిస్తున్నాయి. సీతాలు ప్రమాదవశాన్న పోయిందో, ఆత్మహత్య చేసుకుందో అంతుచిక్కడంలేదు. ఆత్మ హత్య అంటే ఆడది తప్పువొప్పుకోడం. మరి సీతా లేం తప్పు చేసింది. నా కేం అర్ధం కావడంలేదు. పక్కమీద అటూ యిటూ దొర్లాను. దొర్లితే అర్ధమవుతుం దని కాదు – ఆలోచనల్తో నిద్రపట్టక.



లేచాను. బాల్కనీలోకి వచ్చాను. బొగడ చెట్టువేపు చూశాను.

ఆశ్చర్యం! – గోపన్న! –

హరికేన్ లాంతరు వెలుగులో అతడి ప్రతికదలికా చిత్రంగా కనిపిస్తోంది. అశ్రద్ధ చేసిన పవిత్రతలా పడున్న చూరుక్రింది పల్లకిని నెమ్మదిగా తీసి ఇంటిముంగిట పెట్టాడు. భుజంమీది గుడ్డతో బూజుల్ని దులిపాడు. పాత కర్రల్ని తెచ్చి పల్లకీలో వేశాడు. పెళ్ళికి సిద్ధం చేసినట్టు జరీదుప్పటితో చక్కగా అలంకరించాడు. అంతా చేసి క్షణంసేపు పల్లకిని ప్రేమగా చూశాడు. దీపం వెలుగులో పల్లకి పర్ణన్యలక్ష్మిలా గుంది.

మరుక్షణం గోపన్న లోపలికి వెళ్ళాడు. డబ్బా తీసుకువచ్చి పల్లకిని

ఆముదంతో పూర్తిగా తడిపి, అగ్గిపుల్ల గీసి విసిరాడు. పల్లకి భగ్గు మంది. నా నెత్తిమీద పిడుగుపడ్డట్టయింది. నేను చలించాను. చరచరా మెట్లు దిగి బొగడ చెట్టువేపు పరిగెత్తాను. వెలిగే పల్లకీకి కొంతదూరం యివతల పరుగు మరచి పోయాను – అడుగులు ముందుకి వేస్తున్నాను. ఎదురుగా ఆందోళిక అగ్నిపరమై పోతూంటే ఎందుకో ఆందోళన అంతు మీరిపోతోంది. ముత్యాలఛదనం మండి పోతూంటే మనసులో దావాగ్ని మతిచెడగొడుతోంది. నాలుగ్గజాల ఇవతల గోపన్న మోకాళ్ళమీద కూర్చుని తల వంచుకుని మౌనంగా రోదిస్తున్నాడు. నా కా దృశ్యం బౌద్ధభిక్షువు ఆత్మాహుతిలా గుంది.

"గోపన్నా!" దగ్గరికి నడిచి పిలిచాను.

"బాబూ!" గోపన్న బావురుమన్నాడు. తటాలున లేచి దగ్గిరసా వచ్చి నా చేతులు పట్టుకొని, నా మొహాన్ని చూస్తూ చెప్పాడు – "బాబూ, – అంతా – కాలింది – నేనే బాబూ! నేనే జన్మిచ్చి నోణ్ణి. జన్మ తీసేశాను. సంపేశాను బాబూ! ఇదే – ఆ [illegible] సేసిన సేతులు – బాబూ! యీ సేతులమీదే – యిదుగో యిదే నా పల్లకీ – యిందులోనే దానికి పెల్లి సేశాను. కాని – కానీ బాబూ! అది సెడిపోనాది. పాపం సేసింది. పాపానికి సావే మందు బాబూ! సంపేశాను." క్షణం ఆగి మళ్ళా చెప్పాడు: "ఎన్నేల్లో బాబూ! ఈ పల్లకీని పయిత్రంగా, పేనంలా దాశాను. దీనిమీద ఆకరుపెల్లి దాన్దేబాబూ! అపయిత్రం సేసేసినాది బాబూ! మీ వుప్పుతిని బతికినోణ్ణి. నే సచ్చేలోగా తవర్ని పెల్లికొడుకులా సూసి, నా బుజాలమీద, నా పల్లకిలో మొయ్యాలనుకున్నాను. కాని అదింక పనికిరాదుబాబూ – సమించండి మహాప్రభో, సమించండి!–"

నా కింక గోపన్న మాటలు వినబడ లేదు పవిత్రదేవత ఆత్మశాంతికి వెలిగించిన సమిధలా పల్లకి మండుతోంది. నా హృదయమూ అలాగే మండుతోంది. నా వంశం విలువ నాకంటే గోపన్నకే ఎక్కువ తెలుసు ననుకుంటున్నాడు. విశ్వాసం అంటే యిదే కాబోలు.

మంటవేడికి బొగడచెట్టు ఆకులు కందినట్టు నా మొహం కందిపోతుందని అద్దం చూసుకోకపోయినా తెలుస్తోంది.

గదిలోకి వెళ్ళాను; లైటు వేశాను.

"బాబూ!" – వెనక్కి చూసేను. గోపన్న. [illegible].

"ఏం?" అన్నాను అలాగే వుండి.

"పల్లకి మరిచిపోయాను బాబూ!"

నేను మరచిపోలేదు. [illegible] వాడిదగ్గరికి వెళ్ళాను. కోపంగా – "ఇప్పుడా నీకు వేళ కుదిరింది?" అన్నాను హఠాత్తుగా. వాడు నా కాళ్ళమీద పడ్డాడు – "బాబూ! ఆడిబో సెప్పకుంటే బాబూ! నన్ను సంపేత్తాడు."




"ఏమిటి ?"

"నిన్నరేత్తిరి తమరు మేడమీది నించి నన్ను సూశారుబాబూ ! మీకు తెలుసుబాబూ ! కాని బాబూ – ఎంత పేమించినా పల్లకీలో పెల్లయిన పిల్లని ఎలా కట్టుకోను బాబూ ! అయినా లేచి పోడానికి నిచ్చయించుకున్నాం. కానీ మీలాగే ఆడికీ తెల్సిపోయింది బాబూ ! ఆ డసలే కూతుర్ని సంపిన రాచ్చసుడు. మీరే నన్ను కాయాలి బాబూ ! ఏదో తప్పు సేశాను."

"ఏం తప్పు ?"

"అదే బాబూ – పేమించాను."

"అది తప్పా ?"

"పెల్లిని గౌరయిస్తే తప్పేబాబూ !"

"సరేలే పో ! నాకు నిద్రొస్తోంది."

"బాబూ–"

"అలాగే–వెళ్ళు." వాణ్ని పంపించి తలుపు వేసేశాను, బెడ్ దగ్గరికి నడిచాను.

పెళ్ళయి ప్రేమ కోల్పోయినవాళ్ళకి ప్రేమించే అర్హత పోతుందనుకుంటా. నిన్నరాత్రి నేనసలు వాణ్ని చూడలేదు. వాడు నన్ను చూసి అలా అనుకున్నాడు. నాకిప్పుడు అర్థమైంది. నాకు సీతాలంటే యిప్పుడు అసహ్యం. నేను అందాన్ని గౌరవిస్తాను. అందులోనే తప్పు కనబడింది; అది నేను సహించలేను.

కిటికీలోంచి చల్లగా ప్రవహిస్తున్న గోస్తనది కనబడుతోంది. ఆ నీటిలోనే సీతాలు పోయింది – పవిత్రమైన నీరు. ఎప్పటికైనా పాపాన్ని పవిత్రతే హరించాలేమో ! – నాకు తెలియదు.

———

# శాంతిభద్రతల రక్షణ

ఆ రోజు నగరంలో సందడి ఎక్కువగావుంది. అధికధరలకు నిరసనగా నగరములో సమ్మె జరగుతున్నది. అన్నిపార్టీలవారూ కలిసి నినాదాలిస్తూ ఊరేగింపులు జరిపారు. "ధరలు తగ్గించాలి" – "వారానికి రెండు ఆదివారాలుండాలి" – "నెలకు రెండు ఫస్టుతారీకులుండాలి" అని కేకలు వేశారు. ఊరేగింపులోని జనం కొన్ని కార్లమీదా దుకాణాలమీదా రాళ్లు రువ్వారని పోలీసులు భాష్పవాయు ప్రయోగం చేశారు. దాంతో ఉద్రిక్తత ఎక్కువయింది. పోలీసు అధికారులకు మతిపోతున్నది.

ఉన్నత పోలీసు అధికారుల సమావేశం జరిగింది. లాఠీలూ, తుపాకులతో ప్రతినాలుగు గజాలకూ రక్షణభటులను నిలబెట్టడానికి నిశ్చయించారు. ఈవార్త దవానలంలా ఊళ్ళో వ్యాపించింది. విద్యార్థులు మరీ పేట్రేగిపోతున్నారు. ఉద్రిక్తత ఎక్కువయింది.

సాయంకాలం విజయమైదానంలో మీటింగు పెట్టడానికి కార్యాచరణసంఘం నిశ్చయించింది. కొన్నిలక్షలమంది సమావేశానికి వొస్తారని అంచనా వేయబడింది. ఇంతలో ఒకాయన అత్యున్నత అధికారిని కలుసుకుని రహస్యంగా మాట్లాడాడు. వివరాలు ఎవరికీ తెలియలేదు. సాయంకాలం సభకు నగరమంతా వచ్చింది ఇసుక వేస్తే అది వెళ్ళి ప్రజల నెత్తిమీద రాలుతున్నది కాని కిందని రాలడంలేదు.

అకస్మాత్తుగా హెలికాప్టర్లో ఎవరో దిగారు. ఆయన్ని చూడగానే ముందు వరుసలో జనం కదలడం మొదలుపెట్టారు. "నిన్నెవరు ఇక్కడికి ఆహ్వానించారు? ఈ హెలికాప్టరేమిటి" అని కార్యకర్తలంతా అతనిమీదికి లంఘించబోతున్నారు. వెంటనే నలభైమంది పోలీసులు అతన్ని జాగ్రత్తగా పట్టుకుని మైకుదగ్గరకు తీసుకువెళ్ళారు. జనసముద్రఘోష ఒక్కసారి ఆగిపోయింది. ఆయన, ఆ కవిగారు, జేబుల్లోంచి కట్టలు తీశారు. నిద్రలో నడుస్తున్న మనుష్యుల్లా ఇన్నిలక్షలమంది వెనక్కి వెనక్కి నడవడం మొదలుపెట్టారు కవిగారు కావ్యగానం ప్రారంభించారు. కావ్యగానం ముగిసేటప్పటికి మైదానమంతా నిర్మానుష్యంగా వుంది.

పోలీసులూ అధికారులూ ఒక్కసారి గట్టిగా ఊపిరి పీల్చుకుని మోకాళ్ళమీద కూర్చుని ఆధునిక కవిత్వశక్తికి వందన మాచరించారు.

గోపాలచక్రవర్తి




# రాక్షసుడు

పాంచకడీదేవ్

నరోత్తమదాసు అహమ్మదాబాదు నగరంలోని పెద్ద వర్తకుల్లో ఒకడు. ఆయన అప్పటికి పాతికేళ్ళక్రితం గుజరాతులోని ఒకానొక గ్రామప్రాంతంనుంచి నగరానికి వలసవచ్చి, గత పదీపదిహేను సంవత్సరాల్లో బాగా ధనం గడించాడు. నగర శివార్లలో ఆయనకు రెండంతస్తులమేడ ఒక టున్నది. రోజూ విద్యుద్దీపాల వెలుగులో, స్నేహితుల రాకపోకలతో కళకళాడే ఆభవనం, నేటిరాత్రి ఎనిమిది గంటలవేళకే ఎంతోనిశ్శబ్దం అయిపోయింది. మేడమీద రెండో అతస్తులోని ఒక గదినుంచిమాత్రం చిన్నవెలుగు కిటికీనుంచి బయటపడుతున్నది. నరోత్తమదాసు కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా మంచంమీంచి లేచి

జేబులు ఒకసారి తవిడిచూసుకుని, తను రాతకోతలు జరుపుకునే డ్రాయింగ్ రూంలోకి అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళాడు. గదిలో దీపంలేదు. నరోత్తమ దాసు తడువుకుంటూ స్విచ్ దగ్గిరకు వెళ్ళి, లైటు వేసి, డ్రాయరుముందున్న కుర్చీలో కూర్చుని, సొరుగులోంచి ఒక తెల్లకాయితం, కలం తీసి, తలవంచుకుని యిలా రాయసాగాడు :

"ఈ సాయంత్రం నా భార్యఅయిన మున్నాబాయి విషం తాగి ఆత్మహత్య చేసుకోవటంతో, నాకు జీవితంమీద విరక్తి కలిగింది. నే నిక జీవించటం అనవసరం అనితోచి ఆత్మహత్య చేసుకుంటున్నాను. రేపు నా బంధుగణం వచ్చింతరవాత నాభార్య శవంతోపాటే, నన్నూ దహించవలసిందిగా కోరుతున్నాను.

—— నరోత్తమదాసు"

ఉత్తరం రాయటం ముగియగానే, నరోత్తమదాసు కుర్చీలోంచి లేచి, జేబునుంచి పిస్టల్ ఒకటి బయిటికితీసి. "భగవాన్, నన్ను క్షమించు. ఆత్మహత్య మహా పాతకమని నాకు తెలుసు. కాని, నాజీవిత సర్వస్వంగా ప్రేమించినభార్య ఆత్మహత్య చేసుకున్న తరవాత, నేంతుకూడా లేని నేను బ్రతికిఉండి ప్రయోజనం ఏమిటి ? భగవాన్, మరొక్కసారి నన్ను క్షమించ వేడుతున్నాను," అంటూ పిస్టల్ కణతల మీద ఆనించుకోబోయేంతలో, వాకిట ఎవరో వస్తున్న పదధ్వని అయింది. వెంటనే నరోత్తమదాసు గదిలో ఒకమూలకున్న తెరలచాటుకు పోయి దాక్కున్నాడు. ఇంతలో ఒక ముఫ్పైఏళ్ళ యువకుడూ, ఇరవైఏళ్ళ యువతీ గదిలో ప్రవేశించారు. ఆ యువకుడిపేరు గోకుల్‌దాసు; డాక్టరు. యువతి నరోత్తమదాసుభార్య మున్నాబాయికి చదవ, రాయ నేర్పే పంతులమ్మ; పేరు జీనాబాయి.

జీనాబాయి గదంతా ఓమారు కలేచూచి. "నరోత్తమదాస్‌జీ దిగులుతో పై అంతస్తుగదిలో పడుకునివున్నారు. ఇక్కడి కొచ్చి మన సంభాషణ వినేవా రెవరూ లేరు. ఇప్పుడు చెప్పు, వివాహం ఆదేందుకు యిష్టపడుతున్నావా ?" అని ప్రశ్నించింది.

"వివాహమా ?" అంటూ గోకుల్‌దాసు ఆశ్చర్యం ప్రకటించాడు. అతడి కళ్ళల్లో క్రోధజ్వాలలు ముసురుకున్నవి.

"అంత ఆశ్చర్య పడిపోతున్నావేం, దాస్ !" అంటూ జీనాబాయి పళ్ళు కొరికి, "దుర్మార్గుడా! నీ తియ్యనిమాటలు విశ్వసించి నీ వలలో చిక్కుకున్నాను. ఇప్పుడు నేను ఏడునెల్ల గర్భిణిని. నన్ను నాశనం చేయటమేగాక, మిత్రుడూ, హితుడూ అయిన నరోత్తమదాసు భార్యనుకూడా నీ మాయాజాలంతో మతిలేనిదాన్ని చేసి,



అపవిత్రపరిచావు. ఇకనైనా, యీ దుష్టసంబంధం మానుకుందామని అన్నందుకే గదా, ఆమెను నీవు విషం యిచ్చి చంపింవి ?" అన్నది రౌద్రంగా.

"నేను మున్నాబాయిని విషప్రయోగంచేసి చంపానా? నీ కేమన్నా పిచ్చెక్కిందా," అన్నాడు డాక్టర్ గోకుల్‌దాస్ కోపంగా.

"నరోత్తమదాసుకు గృహవైద్యుడుగా, స్నేహితుడుగా నాటకం ఆడి, ఆతడి భార్యను పతితగాచేసి, తప్పుతెలుసుకుని ఆమె తిరిగి గౌరవనీయురాలుగా బతికేందుకు ప్రయత్నించేసరికి, జ్వరానికి మందు యిస్తున్నట్లు నటించి, విషప్రయోగం చేశావ్.

ఆసంగతి వెల్లడై నీకు ప్రమాదం కలుగుతుందేమోనన్న భయంతో, ఆమె మరణించిం తరవాత, ఆమె చేతిలో కార్బాలిక్ యాసిడ్ వున్న సీసా పెట్టావు. ఇదంతా నాకు తెలిసిందే. శవం యింకా గదిలోనే వున్నది. నీమీద పోలీసులకు రిపోర్టు యిచ్చి, శవపరీక్షసమయంలో, నీ పైశాచిక ప్రవర్తనంతా బయటపెట్టగలను. హంతకుడివి నువ్వని రుజువుచేయటానికి నాదగ్గిర చాలా ఆధారా లున్నాయి. కాని, నిన్ను వురితీయించటం నాకోర్కెకాదు. నాగర్భస్థ శిశువుకు తండ్రివి నీవు. అందుకే నన్ను వివాహం ఆడమంటున్నాను. ఆ తరవాత ధర్మపత్నిగా నీకు సేవలు చేస్తూ, జీవితం గడపగలను,'' అన్నది జినాబాయి.

గోకుల్‌దాసు ఒక్కసారిగా హుంకరించి మెరుపులా జినాబాయిమీదికి దూకి, ఆమెగొంతును గట్టిగా రెండుచేతుల్తో బంధించి, "దుర్మార్గురాలా చావు! నా రహస్యాన్ని పోలీసులముందు బయటపెడతావా? ఇంతకాలం నా సాంగత్యం అంగీకరించి, యిప్పడు కాదన్న మున్నాబాయిగతే నీకూ పట్టిస్తాను," అంటూ బలంగా నొక్కసాగాడు.

జినాబాయి వూపిరాడక గిలగిల కొట్టుకోసాగింది. కళ్ళు పైకి పొడుచుకురాసాగినై. గొంతులో చిన్నగా గురకలాంటిది ప్రారంభమైంది. ఆమె ఆ సంకటస్థితిలో ఉండగా,హఠాత్తుగా తెరవెనకనుంచి నరోత్తమదాసు పిష్టల్ పైకెత్తిపట్టుకుని బయిటికివస్తూ, ''హంతకుడా! గోకుల్‌దాస్! తక్షణం ఆమెను వదులు,'' అంటూ గర్జించాడు.

గోకుల్‌దాసు ఆ గర్జన వింటూనే బెంబేలెత్తిపోయి, జినాబాయిని వదిలి వెనక్కు తిరిగిచూశాడు. చేతిలో పిష్టల్ పట్టుకుని నరోత్తమదాసు కనుపించాడు. డాక్టర్ ప్రాణాలు ఎగిరిపోయినంత పనయింది. అతడి కాళ్ళూ, చేతులూ వణకసాగినై. గదిలోని తెరచాటునవుండి తమసంభాషణ అంతా నరోత్తమదాసు విన్నాడనీ, యిక తనకు చావు తప్పదనీ అతడు నిశ్చయించుకున్నాడు.

జినాబాయి ఒకసారి పెద్దగా దగ్గి, ఆయాసపడుతూ నేలమీద పొర్లసాగింది. ఆమెకిప్పుడిప్పుడే శ్వాస ఆడసాగింది. ఆమెస్థితి చూసిన నరోత్తమదాసు, పిష్టల్‌ను డాక్టర్ గుండెలకు గురిచేసి. "నీచుడా! అలా చూస్తావేం? ఆ టేబిల్‌మీదవున్న కూజాలోనినీరు గ్లాసులో పోసి, ఆమెకు యివ్వు. ఊఁ!" అంటూ గద్దించాడు.

గోకుల్‌దాసు పిల్లిలా పోయి, గ్లాసులో నీళ్ళుపోసి, జినాబాయి పక్కనకూచుని, ఆమె పెదిమలదగ్గిరకు దాన్ని తీసుకుపోయి,"జినూ, యీనీళ్ళు తాగు,"అంటూ ఎంతో ప్రేమగా లాలించాడు. జినాబాయి ఒకసారి మూలిగి, గ్లాసులోనీళ్ళు కొద్దికొద్దిగా



చప్పరించసాగింది. ఆమెలో తిరిగి జీవం ప్రవేశించినట్టయింది. తూలుతూ లేచి నిలబడి, నరోత్తమదాసుకేసి కన్నార్పకుండా చూడసాగింది.

నరోత్తమదాసు, పిస్టల్‌ను గోకుల్‌దాసు తలకు గురిచేసి, "డాక్టర్ గోకుల్ దాస్! నీవు నా భార్య శీలాన్ని పాడుచేసింది చాలక, ఆమెకు విషప్రయోగం చేసి, ప్రాణాలు తీశావు. నీలాంటి పాపాత్ముడికి యీ ప్రపంచంలో చోటు లేదు. నిన్ను చంపి, తరవాత నేను ఆత్మహత్య చేసుకుంటాను. మన యిద్దరి మరణం విషయమై జీనాబాయికి ఎలాంటి చిక్కులూ రాకుండా, మన చావుకు కారణాలు రాసి, యిక్కడ వుంచుతాను," అంటూ పిస్టల్‌ను ఎడంచేతికి మార్చుకుని, టేబిల్ ముందు కెళ్ళి, కుడిచేత్తో కలం అందుకోబోయాడు.

గోకుల్‌దాసు, జీనాబాయికి కనుసైగ చేశాడు. వెంటనే ఆమె తన పైటచెంగును నరోత్తమదాసు కంఠానికి చుట్టబెట్టి వెనక్కు లాగింది. హఠాత్తుగా వచ్చిన యీ దాడికి నరోత్తమదాసు తబ్బిబ్బయి, కేకపెట్టబోయేంతలో, గోకులదాసు పైటచెంగు తన చేతికి తీసుకుని, దాన్ని బలంగా నరోత్తమదాసు మెడకు మెలిపెట్టి బిగించి

లాగాడు. నరోత్తమదాసు కళ్లు తేలవేసి దభీమంటూ వెల్లికిలా పడిపోయాడు. పిస్టల్ అతడి చేతిలోనుంచి జారి కిందపడిపోయింది. గోకుల్‌దాసు, అతడి గుండెల మీద ఎక్కి కూచుని రెండు చేతులతో కంఠాన్ని గట్టిగా నొక్కాడు. నరోత్తమదాసు కొంచెంసేపు విలావిల్లా తన్నుకుని, నిశ్చేతనంగా వుండిపోయాడు.

గోకుల్‌దాసు తృప్తిగా నవ్వుతూ లేచి నిలబడ్డాడు. జినాబాయి అతడి భుజం పట్టుకుని, "ఇప్పు డేంచేద్దాం?" అని ప్రశ్నించింది.

"నువ్వు. నీ గదిలోకి పోయి పడుకో," అన్నాడు గోకులదాసు.

"ఈ శవం సంగతి?"

"ఈ శవం యిక్కడే వుంటుంది. తను ఆత్మహత్య చేసుకోబోతున్నట్టు ఈ శుంఠ ముందుగానే వుత్తరం రాసి, టేబిల్ మీద పెట్టాడుగదా?" అన్నాడు గోకుల్ దాసు.

"గొంతుమీద వున్న గాయాల సంగ తేమిటి? ఎవరైనా తమ గొంతు తాము పిసుక్కుని ఆత్మహత్య చేసుకోగలరా?" అని ప్రశ్నించింది జినాబాయి.

"ఆహాఁ, సమయానికి గుర్తు చేశావ్. అదుగో, ఆ మూలవున్న తాడిటు తీసుకురా. దాని కొన ఒకటి వీడి గొంతుకు బిగించి, రెండవ కొనను దూలానికి కడతాను. చూసినవాళ్లు ఉరిపోసుకు చచ్చా డనుకుంటారు," అన్నాడు గోకులదాసు. జినాబాయి తాడు తెచ్చి అతడి చేతి కిచ్చింది. గోకులదాసు, నరోత్తముడి గొంతుకు ఉచ్చు బిగించి, తాడును దూలానికి కట్టి బలంగా గుంజి ముడివేశాడు.

"మన పని ముగిసింది. నేను బయిటికి పోతాను. నువ్వు గదితలుపులకు లోపల గడివేసి, మేడ పైభాగాన వున్న నీ గదికి పోయి నిశ్చింతగా నిద్రపో," అని చెప్పాడు గోకులదాసు. జినాబాయి అతడు చెప్పినట్టే చేసింది.

## 2

నరోత్తమదాసు తను ఆత్మహత్య చేసుకునేందకు నిశ్చయించుకుని, యీ లోపల తన భార్య మున్నాబాయి విషం తాగి చనిపోయిన సంగతి పోలీసులకు తెలియపరచటం మంచిదనుకుని, మనిషిద్వారా పోలీస్‌స్టేషన్‌కు కబురుపంపాడు. సబ్ఇన్‌స్పెక్టర్ పోలీసులతో అతడి ఇంటికి వచ్చేసరికి ముప్పావుగంట కాలం గడిచిపోయింది. ఇన్‌స్పెక్టర్ ఇంటి దాసీద్వారా మున్నాబాయిశవం వున్న గది తెలుసుకుని, అక్కడికి వెళ్ళి, శవాన్ని చూసి, ఒక పోలీసు జవానును గవర్నమెంట్ డాక్టర్‌కోసం పంపి, దాసీని, నరోత్తమదాసుగా రెక్కడ అని అడిగాడు.

"ఆయన తన పడక గదిలో లేరు; డ్రాయింగ్‌రూమ్‌లో వుండివుంటారు," అని చెప్పింది దాసి. ఇన్‌స్పెక్టర్ డ్రాయింగ్‌రూమ్ గదితలుపు నెట్టి చూశాడు. అది లోపల గడివేసివున్నట్టు తెలిసింది. గట్టిగా తట్టిచూశాడు; జవాబులేదు.

భార్య మరణించిందన్న దిగులుతో నరోత్తమదాసు ఏదో అఘాయిత్యం చేశాడన్న అనుమానం ఇన్‌స్పెక్టర్‌కు కలిగింది. అతడు గదితలుపులు బద్దలుకొడదామనుకుని, అందుకు ఎవరైనా మధ్యవర్తి వుండటం మంచిదని భావించి, దాసీదాన్ని "మీ యజమాని బంధువులుగాని, స్నేహితులుగాని యీ దగ్గర్లో ఎవరైనా వున్నారా?" అని ప్రశ్నించాడు.

"డాక్టర్ గోకుల్‌దాసు మా యజమానికి గృహవైద్యుడూ, మంచి స్నేహితుడు కూడా. ఆయన ఇల్లు యీ దగ్గర్లోనే వుంది," అంటూ ఆ ఇంటి గుర్తు చెప్పింది.

ఇన్‌స్పెక్టర్ పంపిన పోలీసుజవా నొకడు డాక్టర్ గోకుల్‌దాసును క్షణాలమీద నరోత్తమదాసు ఇంటికి తీసుకువచ్చాడు. ఇన్‌స్పెక్టర్ అతణ్ణి, "మీరు నరోత్తమదాసుగారి గృహవైద్యులట, నిజమేనా?" అని ప్రశ్నించాడు.

''అవును. ఏం జరిగింది?'' అంటూ గోకుల్‌దాసు ఎక్కడలేని ఆదుర్దా కనబరిచాడు

''మేడమీది గదిలో ఆయన భార్య ఆత్మహత్య చేసుకున్నది. ఆ శవపరీక్షకూ, పంచాయితీకి ఏర్పాట్లు చేశాను. పోతే, యిప్పుడు మరొక ప్రమాదం జరిగినట్టు నా కనుమానం కలుగుతున్నది. నరోత్తమదాసుగారు, యీ గదిలో తలుపులు బిగించుకుని కూర్చున్నారు. ఎంత పిలిచినా పలకటం లేదు. తలుపులు బద్దలుకొట్టి లోన ప్రవేశించటం ఒక్కటే మార్గంలా కనిపిస్తున్నది," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

''ఆయనకు భార్యంటే అపరిమితమైన ప్రేమ. అతడూ ఆత్మహత్య చేసుకున్నాడని మీరు శంకిస్తున్నారా?'' అన్నాడు గోకుల్‌దాసు.

''ఏమైనా జరిగుండొచ్చు. మీ రా కుటుంబమిత్రులు. మీ సమక్షంలో తలుపులు బద్దలు కొట్టించబోతున్నాను,'' అన్నాడు ఇన్‌స్పెక్టర్.

''సరే, కానివ్వండి,'' అన్నాడు గోకుల్‌దాసు ముక్తసరిగా

ఇద్దరు ముగ్గురు పోలీసులు గునపాలతో పొడిచి తలుపుల్ని విరగ్గొట్టారు. ఇన్‌స్పెక్టర్ ముందుగా లోపల ప్రవేశించి, టార్చిలైటుతో ఓమారు గదంతా కలయచూసి ఆశ్చర్యపడి, లైట్ స్విచ్ వేశాడు. గదంతా వెలుగుతో నిండిపోయింది. గదిలో కుర్చీలూ, బల్లలూ తప్ప మరేమీ లేదు. నరోత్తమదాసుగాని, అతడి శవంగాని అక్కడ కనిపించలేదు.

అక్కడ ఎదురైన దృశ్యం డాక్టర్ గోకులదాసును దిగ్భ్రాంతుణ్ణి చేసింది. శవం ఏమైనట్టు? అతడు నిలువెల్లా కంపించిపోయాడు. ఇన్స్పెక్టర్ మరొకసారి భవనంలోని అన్ని గదులూ తిరిగి జీనాబాయి వున్న గదిదగ్గిరకు పోయి, తలుపు తట్టాడు. అప్పుడు ఇంటిదాసీ వచ్చి, ఆమె తీవ్రమైన జ్వరంలో ఒళ్లు తెలియకుండా పడివున్నదని చెప్పింది. లోపలికి పోయి చూశాడు, ఇన్స్పెక్టర్. అతడివెంట గోకుల్దాసుకూడా వున్నాడు. జీనాబాయి కళ్లు తెరిచి చూసిందిగాని, ఎవరినీ గుర్తు పట్టగల స్థితిలో వున్నట్టులేదు. జ్వరతీవ్రతలో ఏదో గొణుక్కుంటున్నది.

ఆమె నా స్థితిలో పలకరించి లాభం లేదనుకుని ఇన్స్పెక్టర్ వెనుదిరిగాడు. అతడితోపాటు గోకుల్దాసుకూడా వెనుదిరిగాడు. కాని, అతడికి మతి పోతున్నది. నరోత్తముడి శవం ఎలా మాయమయింది? జీనాబాయి జ్వరవేగంలో జరిగిందంతా పలవరించదుగదా? ఇవీ అతడి భయాలు...

కొద్దిసేపట్లో నరోత్తముడి బంధువులు వచ్చి చేరారు. మున్నాబాయి శవాన్ని శవపరీక్షకోసం తీసుకుపోయారు. డాక్టర్ గోకుల్దాసు కొంచెంసేపు ఆ ఇంటి ముందు అటూయిటూ తచ్చాడి, ఏమి చేసేందుకూ తోచక స్వగృహానికి వెళ్ళి పోయాడు. ఆ రాత్రి అతడికి నిద్రపట్టలేదు. కొంచెం కునుకుపడితే చాలు పీడకలలు— శవాల, పిశాచాల వికటాట్టహాసాలు. అతడికి తాను పిచ్చివాడైపోతున్నానేమో అనిపించింది. తెల్లవారేవరకూ మంచంమీద అటూ ఇటూ దొర్లి, సూర్యోదయంతోనే లేచి గదిబయటికి వచ్చాడు. అక్కడ, తను ఇంట లేనప్పుడు వచ్చిపోయేవారు తమ పేర్లు రాసేందుకు వేళ్లాడకట్టిన బోర్డుమీది తెల్లకాయితంపైన, నరోత్తమదాసు అన్న పేరు పెద్ద అక్షరాలతో రాయబడివున్నది.

ఆపేరు చూస్తూనే గోకుల్దాసు నిర్విణ్ణుడయిపోయి, ఒకసారి తల పీక్కుని, ఇంటి గేటుదగ్గిరున్న నౌకరును పెద్దగా కేకవేసి పిలిచి, "ఇక్కడ బోర్డుమీద పేరు రాసిపోయినవాళ్ళెవరు?" అని ప్రశ్నించాడు.

"మసక చీకటిలో వచ్చాడు. నేనంతగా గుర్తించలేదు. మిమ్మల్ని తమ ఇంటికి రావలసిందని చెప్పమన్నాడు. కొంచెం ఎత్తుగా, లావుగా..." అంటూ నౌకరు మరేదో చెప్పబోయేంతలో, గోకుల్దాసు పళ్ళు కొరుకుతూ, "ఇక, ఆ వాగుడు ఆపు!" అంటూ అరిచి తనగదిలోకి చరచరా వెళ్ళిపోయాడు. అతడికి నరోత్తముడు చావలేదనీ, బతికే వున్నాడనీ, తన అంతం సమీపించిందనీ భయం పట్టుకున్నది. కాని, తా నా ఇంటికి వెళ్ళక తప్పదు...

గంట తరవాత గోకుల్దాసు, నరోత్తమదాసు ఇంటికి వెళ్లాడు. అత ణ్ణిప్పుడు

ఎక్కడలేని తెగువతనం ఆవేశించింది. చావోబతుకో తొందరగా తేల్చుకోవటం మంచిదనుకున్నాడు. కాలహరణం ఎందుకు? కానీ, నరోత్తమదాసు ఇంటివాకిట అతడికి కనిపించిన వ్యక్తి, జగన్నాధుడు. ఇతడు నరోత్తమదాసు తమ్ముడు. ఇతడి పూర్తిపేరు జగన్నాధ నరోత్తమదాసు. గుజరాతీయుల్లో ప్రతివాడూ తన పేరుతోపాటు తండ్రిపేరుకూడా కలిపి చెప్పుకుంటాడు. ఆ కారణంవల్ల, కనిపించకుండా పోయిన నరోత్తమదాసు పూర్తిపేరు రఘునాధ నరోత్తమదాసు. చిన్నవాడు జగన్నాధ నరోత్తమదాసు.

తను అనవసరంగా భయపడి బుర్ర పాడుచేసుకున్నందుకు గోకుల్‌దాసు తనలో తాను చిన్నబుచ్చుకున్నాడు. జగన్నాధుడు, అతణ్ని గదిలోకి ఆహ్వానించి తీసుకుపోయి కుర్చీ చూపుతూ, "కూర్చోండి డాక్టరుగారూ!" అని చెప్పి, ఆ పక్కనే మరో కుర్చీలో కూర్చునివున్న ఒక ఆజానుబాహువైన ముప్పై ముప్పైఐదేళ్ళ వ్యక్తిని చూపుతూ, "ఈయన డిటెక్టివ్ ఖండేరావ్‌గారు," అని చెప్పాడు.

డిటెక్టివ్ పేరు వింటూనే గోకుల్‌దాసు గతుక్కుమన్నాడు. ఖండేరావు, ఆతడి వాలకం గమనిస్తూనే వున్నాడు. జగన్నాధుడు మరొక కుర్చీలో కూర్చుంటూ, "డాక్టరుగారూ! సంగతి సందర్భాలన్నీ మీకు తెలిసినవే గదా! మా వదినె విషంతాగి ఆత్మహత్య చేసుకున్నది. మా అన్నగారు వియోగదుఃఖాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకుంటున్నట్టు వుత్తరం రాసి, కనబడకుండా పోయారు. పోతే, ఆయన తన ఆస్తిపాస్తుల విషయమై లోగడ ఎప్పుడో రాసిన విల్లుకూడా దొరికింది. అందులో ఆయన, తన తదనంతరం తనభార్య నిస్సంతుగా మరణించటం జరిగితే, ఆస్తిలో రెండువంతులు నాకు, ఒకవంతు మీకు చెందవలసినటు రాశారు. సరే, యిప్పుడు మా వదినెగారు లేరు. అన్నగారు సజీవులా, కాదా అన్న సంగతి కనుక్కునేందుకు డిటెక్టివ్ ఖండేరావుగారిని నియమించాను. వారడిగే ప్రశ్నలకు మీకు తెలిసినంతలో జవాబివ్వకోర్తాను," అన్నాడు.

డిటెక్టివ్ ఖండేరావు ఓసారి గొంతు సవరించుకుని, "ఆ హత్య జరిగిన గదిని పరిశోధించిన తరువాత, నే నెవర్నీ ప్రశ్నించవలసిన అవసరం కనబడటంలేదు. ఆ గదిలోకి కనీసం నలుగురుపురుషులూ, ఒక స్త్రీ రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతాల ప్రవేశించారు. పురుషుల్లో ఒకడిచేతికి నాలుగువేళ్ళు మాత్రమే వున్నాయి. ఆ గుర్తులు అక్కడున్న ఒక కుర్చీచగరీబుమీద స్పష్టంగా కనిపిస్తున్నాయి. అవి నెత్తురు మరకలు," అన్నాడు.

"నరోత్తమదాసుగారు హత్య చేయబడ్డారనా, మీ అభిప్రాయం?" అని అడిగాడు గోకుల్‌దాసు, వేగంగా కొట్టుకుంటూన్న గుండెతో సతమతమవుతూ.

"అవును. హత్యే, ఆత్మహత్యకాదు," అన్నాడు ఖండేరావు.

"మరి శవం ఏమయినట్టు?"

"హంతకులో లేక హంతకుడో దాన్ని మాయం చేశారు. ఇంటిదాని చెప్పుతున్న దాన్నిబట్టి - జగన్నాథుగారు క్షమించాలి - నరోత్తమదాసుగారి భార్య మున్నాబాయి శీలాన్నిగురించి నాకు కొన్ని అనుమానాలు కలుగుతున్నవి. ఆమెది హత్యా, ఆత్మహత్యా అన్న సంగతి పరిశోధించవలసి వున్నది. అంతేకాక, మున్నాబాయికి చదువు నేర్పే పంతులమ్మ జినాబాయి మేడ పైగదిలో ఒళ్ళూపై తెలియని జ్వరంలో వుండి ఏదో పలవరిస్తున్నది. ఆమెను ప్రశ్నించటానికి వెళ్ళిన నాకు, ఆ అవసరం కలక్కుండానే హత్యకు సంబంధించిన కొన్ని రహస్యాలు తెలిసినై. కనక, ఇప్పుడు నా కొక్కవలసింది సాక్ష్యాధారం! రుజువు!" అంటూ తల వంచు కునివున్న గోకుల్‌దాసుతో, "అంతా వింటున్నారా డాక్టరుగారూ; ఏదో పరధ్యానంలో వున్నట్టున్నారు!" అన్నాడు డిటెక్టివ్ ఖండేరావు.

"అహాహా! పరధ్యానంకాదు. నరోత్తమదాసుగారు నాకు ప్రాణమిత్రుడు, ఎంతో మంచివాడు. అలాంటివాడికి యీ బలవన్మరణ మేమిటా అని ఆలోచిస్తున్నాను," అన్నాడు గోకుల్‌దాసు. అతడి నుదురు చెమటతో తడిసిపోయింది. చేతులు కొంచెంగా వణుకుతున్నాయి.

డిటెక్టివ్ ఖండేరావు తృప్తిగా తనలో తాను నవ్వుకున్నాడు. ఇంటిదానికీ, జినాబాయికీ నరోత్తమదాసు గృహజీవితాన్ని గురించిన కొన్ని రహస్యాలు తెలిసి వుండవచ్చని అతడు భావించాడు. ఇంటిదాని హేనా అతడి ప్రశ్నలకు బెదిరిపోయి, సూచనప్రాయంగా డాక్టర్ గోకుల్‌దాసు తన యజమానురాలైన మున్నాబాయితో చాలాచనువుగా వుండేవాడని చెప్పింది. పంతులమ్మ జినాబాయీ, డాక్టరూ దాదాపు భార్యా భర్తల్లా మసులుకోవటం తా నెరుగుదునన్నది దానిమీద ఖండేరావుకు చాలా అనుమానాలు కలిగాయి. హత్యలో, ఆత్మహత్యలో జరిగిపోయిన రాత్రినుంచే జినాబాయికి జ్వరం ముంచుకురావట మేమిటి? ఆమె గదికి వెళ్ళి పలకరించాలని చూశాడు. కాని, ఆమె యీ లోకంలో లేదు: ఏదో మెల్లిగా గొణుగుతున్నది. ఎంత ప్రయత్నించినా, 'గోకుల్! గోకుల్!' అన్న పదాలుతప్ప, అతడికి మరేదీ స్పష్టంగా వినబడలేదు. తనఎత్తు ఎంతవరకు పారుతుందో అని డాక్టర్ గోకుల్‌దాసుమీద ఒక రస్సా వేసిచూశాడు. బ్రహ్మాండంగా పనిచేసింది డాక్టరు వెలవెల పోవటం, చేతులూ, కాళ్ళూ వణకటం అతడు గమనించాడు.

జగన్నాథ్‌గారూ, ఈ హత్యల్లో ఒకడికంటె ఎక్కువమంది దుర్మార్గులే పాల్గొన్నారు. వాళ్ళను వురికంబం ఎక్కించితీరుతాను. అదేమంత కష్టమైన కార్యం కాదు," అన్నాడు ఖండేరావు.

"మీరు పని నెరవేర్చితే రెండువేల రూపాయిల ఫీజు చెల్లించుకుంటానని ముందే చెప్పాను. గవర్నమెంటు డిటెక్టివ్‌లమీద నా కంత విశ్వాసం లేదు," అన్నాడు జగన్నాధనరోత్తముడు.

"ఫీజు దేముందిలెండి. రెండువేలరూపాయిలు మీ కో పెద్దమొత్తంకింద లెక్కకాదు. మీ అన్నగారి ఆస్తిలో మీది రెండువంతులూ, డాక్టర్ గోకుల్‌దాసుగారిది ఒకవంతూ. అదేగదా, మీ అన్నగారు వీలునామాలో రాసింది ?" అని అడిగాడు ఖండేరావు.

ఆ ప్రశ్న వింటూనే జగన్నాధ్, గోకుల్‌దాసులు గతుక్కుమన్నారు. ఓ క్షణ కాలం నిశ్శబ్దం — జగన్నాధుడు నీళ్ళు నములుతున్నవాడిలా, "ఖండేరావ్‌గారూ, కొంపతీసి మీరు మా యిద్దర్నీ హంతకులనుకోవటంలేదుగదా ?" అని అడిగాడు.

"హంతకులు నలుగురికన్న ఎక్కువే వున్నట్టు కనబడుతోంది. నలుగురే అనుకుందాం. అలాంటప్పుడు తతిమ్మా యిద్దరూ ఏమయారు ?" అంటూ ఖండేరావు పెద్దగా నవ్వుతూ కుర్చీలోంచి లేచి, "మళ్ళీ కలుసుకుంటాను. ఇంటి చుట్టుపక్కల మరొకసారి పరిశీలించి చూడాలి," అంటూ గదినుంచి బయిటికి వెళ్ళిపోయాడు.

## 3

నరోత్తమదాసుపై డాక్టర్ గోకుల్‌దాసూ, అతడి ప్రియురాలు జీనాబాయీ చేసిన హత్యాప్రయత్నం మరింత నిగూఢం, గందరగోళం అయిపోవడానికి కారకులు యిద్దరువ్యక్తులు. వాళ్ళల్లో ఒకడు లాల్‌దాసు అనేవాడు; ముప్పైఏళ్ళ యువకుడు, చిన్నతరహాదొంగ. రెండవవాడు అతడి స్నేహితుడైన దామోదరుడనే మార్వాడీ జాతివాడు. వీడికి నలభై ఏళ్ళ వయసుంటుంది. ఎద్దుబండి తోలుకుని జీవయాత్ర చేస్తూ, లాల్‌దాసుకు దొంగతనాల్లో వీలయినప్పుడల్లా సహాయపడుతూ, అతడి నుంచి తృణమో పణమో పుచ్చుకుంటాడు.

నరోత్తమదాసు ఇంటిదాసీ అయిన హేనాతో, లాల్‌దాసుకు బాగా పరిచయం వున్నది. అతడు వీధివెంట వచ్చిపోయేటప్పుడు, హేనా తలవాకిట కనిపిస్తే, హాస్యాలుగా పరాచకాలు విసిరిపోతూంటాడు. హేనాకు అతడి స్వభావం గురించి తెలియదు; అతడికి, ఆమె తన శక్తికిమించినవేట అన్నభయం వున్నది.

నరోత్తమదాసు భార్య మున్నాబాయి మరణించిననాటి సాయంత్రం పొద్దుకుంకే వేళ లాల్‌దాసు, వీధివాకిట నిలబడివున్న హేనాను పలకరించి, సంగతంతా విన్నాడు. అత డా లోగడ ఆమెద్వారా, మేడ పై భాగాన ఎవరి పడకగదు లెక్కడో, ఇనప్పెట్టె ఎక్కడుంటుందో, దాని తాళంచేతులు ఎక్కడ దాస్తారో, వెండి సామా న్లుండే అలమరా — అంతా మాటలసందర్భంలో అడిగినట్టు అడిగి తెలుసుకున్నాడు.

లాల్‌దాసుకు, నరోత్తముడిఇంట దొంగతనం చెయ్యటానికి ఆరోజు రాత్రి మంచి అవకాశం అని తోచింది. అతడు హడావిడిగా దామోదరుడి ఇంటికి వెళ్ళి, అతడితో సంగతిసందర్భాలు చెప్పి, రాత్రి కొంచెం పొద్దుపోయిం తరవాత దొంగతనానికి బయలుదేరా లన్నాడు. మరీ రాత్రయితే, దూరప్రాంతాలు వున్న నరోత్తముడి బంధుగణంఅంతా వచ్చి చేరవచ్చనీ, అందుకని తమపని ఎంత తొందరగా ముగించుకుంటే అంత మంచిదనీ దామోదరుడికి చెప్పి ఒప్పించాడు.

రాత్రి తొమ్మిది గంటలప్రాంతాల దామోదరుడూ, లాల్‌దాసూ ఒంటెద్దుబండిలో ఎక్కి నరోత్తమదాసు ఇంటిని సమీపించారు. వాళ్ళకు ప్రహరీగోడతో కలిసివున్న కారుపెట్టుకునే షెడ్డు, మేడమీదికి వెళ్ళటానికి అనుకూలంగా కనిపించింది. ఎద్దుబండిని షెడ్డువెనక ఆపి, ఇద్దరూ కారుషెడ్డు ఎక్కి అక్కణ్ణించి ఇనపచువ్వలు లేకుండా, పెద్ద తలుపులుమాత్రమే వున్న కిటికీని సమీపించారు. వాళ్ళకు లోపలినుంచి కిటికీ సందులగుండా సన్ననివెలుగు బయిటికిరావటం కనిపించింది. లాల్‌దాసు, నిశ్శబ్దంగా వుండమని దామోదరుడికి సైగచేసి, కిటికీతలుపు నొకదాన్ని మెల్లిగా కొంచెం తెరిచాడు. అతడికి గుండె గుభేలుమన్నది. నరోత్తమదాసు చేతిలో పిస్టల్ ఎత్తి పట్టుకుని గదికి ఒకమూలనున్న తెరచాటునుంచి బయిటికి వస్తున్నాడు. ఆ పిస్టల్ తమమీద ప్రయోగించేదుకేమో అన్న అనుమానం, భయం ఓక్షణకాలం లాల్‌దాసును నిశ్చేష్టుణ్ణి చేసింది. కాని, నరోత్తమదాసు కిటికీకేసి తలయినా తిప్పకుండా, "హంతకుడా! గోకుల్‌దాస్ .." అంటూ హుంకరించటం వినబడింది. ఆతరవాత లాల్‌దాసూ, దామోదరుడూ గదిలో జరిగిన ఘోరకార్యంఅంతా చూశారు. నరోత్తమదాసు గొంతు పిసికి, అతడిమెడకు తాడు తగిలించి, డాక్టర్ గోకుల్‌దాసూ, జినాబాయీ గదినుంచి బయిటికి వెళ్ళిపోగానే, లాల్‌దాసు, దామోదరుడితో, "మనం యీశవాన్ని మాయంచేయాలి," అన్నాడు ఆనందపారవశ్యాలతో.

"శవాన్ని ఏం చేసుకుంటాం! కాల్చుకు తిందామంటావా?" అని అడిగాడు దామోదరుడు.



“హాస్యానికిది సమయంకాదు. హంతకుల్ని మనం చూశాం. డాక్టర్ గోకుల్ దాసు బాగావున్నవాడు. శవాన్ని కనపడకుండా దాచేసి, అతణ్ణి బెదిరించి డబ్బు గుంజ వచ్చు. ఆ వివరాలన్నీ యిప్పు డెందుకు? కొంచెం సాయంచెయ్యి,” అంటూ లాల్‌దాసు కిటికీరెక్కలు తెరిచి గదిలోకి పోయాడు.

ఆ తరవాత ఆఇద్దరూ నరోత్తమదాసు కాయన్ని కిటికీలోంచి బయిటికి తెః కారుషెడ్డుమీదగా దాన్ని మోసుకుపోయి, బండిలో వేసుకుని శ్మశానంకేసి వెళ్ళారు అక్కడ శ్మశానికి కొద్దిదూరంలో ఒక ఊడలమర్రి దాపున ఏనాటినుంచో జనివాసం లేక పాడుపడిపోయి. పగలూ రాత్రీకూడా దయ్యాలు పోట్లాడుకుంటూ వుంటవని, ఆ చుట్టుపక్కలజనం చెప్పుకునే చీకటికొంప ఒకటి వున్నది. ఆ ఇద్దరూ నరోత్తముడి శరీరాన్ని లోపలికి తీసుకుపోయి, తలుపులూ ద్వారబంధాలూలేని ఒక మారుమూలగదిలో పడవేసి, నిశ్శబ్దంగా బయిటికివచ్చి, ఒంటెద్దుబండీ ఎక్కి ఇళ్ళకు బయలుదేరిపోయారు. కాని, అదృష్టవశాత్తో, దురదృష్టవశాత్తో యీ చిన్నతరహా దొంగలు చేసిపోయినపని, అక్కడ గోడపక్కన ముడుచుకు పడుకునున్న ఒక చింకిదుస్తుల బవిరిగడ్డంవాడు చూశాడు. వాడు లాల్‌దాసు, దామోదరులు బయటికి పోగానే, వాళ్ళు వదిలిపోయిన వస్తు వేమిటా అని చీకట్లో తవిడిచూసి, మానవ దేహం అని తెలుసుకోవటమేగాక, పరీక్షించిచూసినమీదట శరీరంలో యింకా వేడి చచ్చిపోలేదని గ్రహించి, ఒకప్పుడు చిట్కావైద్యంలో చేయిదిరిగినవాడు కావటంతో, పగలు అటుకేసి వస్తూ, శ్మశానప్రాంతాల తాను చూసిన ఓషధీపత్రాల కోసం పరిగెత్తాడు.

ఇక లాల్‌దాసు, ఇంటికి చేరుతూనే, తెల్లవారింతరవాత తాను డాక్టర్‌గోకుల్‌దాసు నుంచి డబ్బుగుంజటానికి ఏది దగ్గిరమార్గమా అని ఆలోచించసాగాడు. లాల్‌దాసును డాక్టరు ఎరుగు. అందువల్ల, డాక్టరు దగ్గిరకు తను వెళ్ళటంకన్న ఎద్దుబండి దామోదరుణ్ణి పంపటం క్షేమ మనుకున్నాడు. ఆ కారణంగా అతడు సూర్యోదయం అవుతూనే దామోదరుడిఇంటికి వెళ్ళి, అతనిభార్య వింటుందేమో అన్న భయంతో, దామోదరుణ్ణి ఇంటినుంచి దూరంగా తీసుకుపోయి, డాక్టర్ గోకుల్‌దాసుతో ఎలా మాట్లాడాలో అంతా చెప్పి, "ఐదువేల రూపాయలకు తక్కువైతే లాభంలేదని గట్టిగా చెప్పెయ్యి; తెలిసిందా ?" అని హెచ్చరించాడు.

అతరవాత యిద్దరూ కలిసి డాక్టరు గోకుల్‌దాసు ఇంటికి బయలుదేరారు. లాల్‌దాసు ఇంటికెదురుగా రోడ్డవతలవున్న ఒకచెట్టుకింద నిలబడి దామోదరుణ్ణి వెళ్ళి డాక్టరింటితలుపు తట్టుమన్నాడు.

దామోదరుడు తలుపు తట్టగానే నౌకరు వచ్చి తలుపు తీసి, "ఏవరికోసం ?" అని అడిగాడు.

"ఈ ఇంట వున్నది డాక్టర్ గోకులుదాసుగారేకదా, మరి ఎవరికోసం వస్తాను ?" అన్నాడు దామోదరుడు దబాయిస్తున్నట్టు.

నౌకరు తనకోసం ఎవరో వచ్చారని చెప్పగానే, గోకుల్‌దాసు కొంచెంగా భయపడ్డాడు. అతడికి రాత్రి నిద్రలేదు. ఏపని చేస్తున్నా, అతడికి నరోత్తమదాసు శవం ఎలా మాయమైందా- అన్న ఆలోచనతప్ప మరేంలేదు. ఈ వచ్చినవా డెవడు ?

నౌకరు, దామోదరుడి వేషభాషల గురించి చెప్పింతరవాత, ఆ వచ్చినవాడు డిటెక్టివ్ ఖండేరావుగాని, పోలీసులుగాని కాదని ధృవపడటంతో, ఎవరో రోగి అయివుంటాడనుకుని, లోపలకు పంపమన్నాడు గోకులదాసు. దామోదరుడు గది లోకి రాగానే, "ఎవరికి జబ్బు ? నాకు ఇళ్ళకొచ్చి రోగుల్ని చూసే తీరిక లేదు," అన్నాడు గోకులదాసు విసుగ్గా. అతడికి దామోదరుడు వ్యాధిగ్రస్తుడిలా కన్పించ లేదు.

"రోగి ఎవరూ లేరండీ, డాక్టరుగారూ ! రాత్రి కొనవూపిరితో వున్న నరోత్తమదాసుగార్ని ఎవరో నా ఇంటికి చేర్చారు," అని పూరుకున్నాడు దామోదరుడు.

ఆ మాటలు వింటూనే గోకుల్‌దాసుకు ముచ్చెమటలు పోసినై. అతడు విలువ గుడ్లువేసి దామోదరుడికేసి ఓ క్షణకాలం చూసి, "నీ పేరేమిటి ? అంత పెద్దగా మాట్లాడకు. ఇప్పుడే వస్తాను, ఆ కుర్చీలో కూర్చో," అని చెప్పి గదినుంచి బయిటికి వెళ్ళి నౌకరుకు, ఎవరొచ్చినా డాక్టరుగారు పనిలో వున్నారని పంపివేయమని ఆజ్ఞ యిచ్చి, తిరిగి గదిలోకి వచ్చి, "నీవు చెప్పే దేమిటో నా కర్థంకాలేదు," అన్నాడు అమాయకత్వం నటిస్తూ.

దామోదరుడు చిన్నగా నవ్వి, "నరోత్తమదాసుగార్ని గొంతుపిసికి చంపాలని ప్రయత్నించినవా ళ్లెవరో నా కళ్లారా చూశాను. ఎలా చూశానని అడక్కండి. కాని, ఆయన మొత్తంమీద గదిలోంచి బయటపడి ఎలాగైతేనేం నా ఇల్లు చేరాడు. నేను వైద్యుణ్ణి పిలిపించేలోపలే ఆయన ప్రాణం పోయింది. కాని, చనిపోయే ముందు నా దగ్గిర కాయితం కలం అడిగి తీసుకుని, తాను డాక్టర్ గోకులదాసుచేత హత్య చేయబడ్డానని, తన ఇంటి గదిలో జరిగినదంతా రాసి, ఆ వుత్తరాన్ని పోలీసులకు యివ్వమన్నాడు," అని చెప్పాడు.

"అలాగా ; అయితే నువ్వు కళ్ళారా జూశానన్నావే, అది అబద్ధం. నరోత్తమదాసు వుత్తరం చదివి సంగతులు తెలుసుకున్నావు. ఆ వుత్తరం వెంట తెచ్చావా ? ఎదీ చూస్తాను," అంటూ చేయి చాపాడు గోకుల్‌దాసు.

"డాక్టరుగారూ, ఎద్దుకండి తోలుకు బతికేవాణ్ణయినా, నే నంత అమాయకుణ్ణి గాను. ఆ వుత్తరాన్ని ఒక రహస్యప్రదేశంలో దాచాను; నరోత్తమదాసు శవాన్ని

కూడా ఒకానొక భూగర్భప్రదేశంలో పదిలపరిచాను. నాకుతప్ప ఆ ప్రదేశాలు హరిహరబ్రహ్మాదులకూ్కడా అంతుచిక్కవు," అన్నాడు దామోదరుడు.

అత డిలా అనగానే గోకుల్‌దాసు తన మనస్సులో, "ఆహా! వల్లో చిక్కావురా, ఉంతా," అనుకున్నాడు. తరవాత ఓ క్షణకాలం ఆలోచించి, "నువ్వు చాలా బీద వాడిలా కనిపిస్తున్నావ్. ఆ శవం ఆ భూగర్భంలోనే కుళ్ళి పట్టయిపోనీ. కాని, ఆ వుత్తరం నా క్కావాలి. ఏదో కొంత ముట్టజెబుతాను," అన్నాడు.

"అయిదువేల రూపాయలు," అన్నాడు దామోదరుడు నిబ్బరంగా.

"చాలా పెద్దమొత్తం!" అంటూ గోకుల్‌దాసు ఆశ్చర్యం కనబరిచాడు.

"అంతకు దమ్మిడీ తక్కువైనా పుచ్చుకోను. నరోత్తమదాసు రాసిన వుత్తరం యివ్వాళే పోలీసులకు ఒప్పచెపుతాను. అ తరవాత జగరబోయే దేమిటో మీరు వూహించుకోవచ్చు," అన్నాడు దామోదరుడు.

"సరే, ఆ మొత్తం యిస్తాను. అంతడబ్బు లెక్కపెట్టేందుకు చాలా కాలం పడుతుంది. పైగా, యీ టైముకు ఒకరోగి రాబోతున్నాడు. అతణ్ని పంపిన తరవాత, నీకు డబ్బు యిస్తాను. ఈ లోపల నువ్వెవరికళ్ళా పడకుండా వుండటం క్షేమం. అదుగో, ఆ లోపలగదిలో కూర్చో. ఎవరికీ అనుమానం తగలకుండా వుండేందుకు నేను బయట గడి పెడతాను. అంతా ఒక్క పావుగంటలో ముగుస్తుంది," అంటూ గోకుల్‌దాసు, దామోదరుణ్ని ఇంటి వెనకభాగంలో వున్న ఒక గదిలోకి తీసుకుపోయాడు. ఆ గది అతడు మందులు నిల్వచేసుకునేది. దామోదరుడికి ఒక కుర్చీ చూపి, అతడు అందులో కూర్చోగానే, ఏవో మందులు వెతుకుతున్నవాడిలా సీసాల దగ్గరకు పోయి, ఒక పెద్దసీసా మూత తెరిచి, "ఇప్పుడే వస్తాను, కూర్చో," అంటూ గదిబయిటికి వెళ్ళి తలుపులకు గడి వేశాడు.

ఆ తరవాత ఒకటి రెండు నిమిషాల్లో దామోదరుణ్ని మత్తులాంటిది ఆవహించింది. ఏదో ప్రమాదం జరగనున్నదని గ్రహించినా, అతడికి అరిచే శక్తిగాని, కుర్చీలోంచి కదిలే ఓపిగ్గాని లేకుండాపోయింది. అతడు అలాగే మైకంతో కళ్ళు మూసి కొద్దిసేపట్లో ప్రాణాలు విడిచాడు.

## 4

డిటెక్టివ్ ఖండేరావుకు, నరోత్తముడి ఇంటి ప్రహరీగోడకు పక్కగా, కారు షెడ్డు నానుకుని బండిచక్రాల గుర్తులూ, గోడమీద ఒకటిరెండు చోట్ల నెత్తురు మరకలూ కనిపించినై. అతడికి క్షణంలో నరోత్తముడి శవం ఎలా మాయమైందీ అర్థమైపోయింది. అక్కడున్న గిట్టల గుర్తులనుబట్టి, ఆ ప్రాంతాల కొచ్చినది



ఒంటెద్దుబండి అని తెలుస్తున్నది. హంతకులు శవాన్ని బండిలో వేసుకుని ఎక్కడికో ఎత్తుకుపోయారు, అనుకున్నాడు ఖండేరావు. నరోత్తము డింటివైపు నున్న ఆ ప్రాంతాల ఎక్కువగా జనసంచారం వుండదు. అందుకాకారణం, ఆ దాపుల నున్నవన్నీ పూరిళ్ళు. అందులో నివసించేవాళ్ళల్లో ఎక్కువమంది కూలీనాలీ చేసుకు బతికేవాళ్ళు. వాళ్ళు నరోత్తము డింటివైపు నున్న నగరప్రాంతానికి రావటానికి వేరే చక్కని కంకరరోడ్డున్నది.

డిటెక్టివ్ ఖండేరావు మర్నాటి ఉదయం, ఆ పూరిపాక లున్న ప్రాంతానికి వెళ్ళి, యిక్కడ ఒంటెద్దుబండివా డెవడైనా వున్నాడా అని వాకబు చేశాడు. అక్కడివాళ్ళు అతడికి దామోదరుడి పేరు చెప్పారు. డిటెక్టివ్ దామోదరుడి ఇంటికి వెళ్ళి అతడికోసం అడిగితే, అతడి భార్య ఇంతకుముందే తన భర్త ఎక్కడికో వెళ్ళాడని చెప్పింది.

"నీ పేరేమిటి? నీ భర్త రాత్రి ఎంత పొద్దుపోయి ఇంటి కొచ్చాడు?" అని ప్రశ్నించాడు ఖండేరావు.

ఆ ప్రశ్నల కామె భయపడుతూ, "నా పేరు భాను. రాత్రి ఆయ నేవేళ యిల్లు చేరారో నాకు తెలీదు. నేను నిద్రపోతున్నాను. మీ రెందు కివన్నీ అడుగుతున్నారు," అన్నది దామోదరుడిభార్య.

"మరేం లేదు. నేను పోలీసును కాను. నీ మొగుడు ఇంటికి తిరిగివస్తే, పోలీసు లొచ్చారని భయపెట్టకు. మరోసారి వస్తాను," అంటూ డిటెక్టివ్ ఖండే రావు, డాక్టర్ గోకుల్‌దాసు ఇంటికేసి వెళ్ళాడు.

ఖండేరావుకు, గోకుల్‌దాసు గురించి వుండవలసిన అనుమానాలన్నీ వున్నవి. శవం మాయం కావటానికి కారకు లేవరో తెలిస్తేగాని, హత్యకేసు ఒక కొలిక్కి రాదు. ఒకసారి గోకుల్‌దాసును అతడి ఇంటిలో కలుసుకోవటం మంచిదని నిశ్చయించుకుని, అతడి ఇల్లున్న వీధికి పోయి, అంత దూరాన్నుంచే పరిసరాలను పరీక్షించి చూడసాగాడు.

అతడికి గోకుల్‌దాసు ఇంటి కెదురుగా వున్న చెట్టుకింద ఒక యువకుడు కనిపించాడు. వాడు డాక్టర్ ఇంటి వీధివాకిలికేసి చూస్తూండటం డిటెక్టివ్ గమనించాడు. కాని, తనను చూస్తూనే, యువకుడు తల మరొకవైపుకు తిప్పుకోవటం అతడికి ఆశ్చర్యాన్నీ, అనుమానాన్నీ కలిగించింది.

డిటెక్టివ్ గోకుల్‌దాసు ఇంటితలుపు తట్టగానే, నౌకరు తలుపు తెరచి, "ఇప్పుడు డాక్టర్‌గార్ని చూసేందుకు అవకాశం లేదు. పెద్ద ఆపరేష నేదో చేస్తున్నారు. సాయంకాలం రండి," అంటూ తలుపులు బిగించబోయాడు. కాని, ఖండేరావ్ బూటుకాలితో ఒక తలుపును గట్టిగా వెనక్కి నెట్టి, "ఆపరేషన్ ఎవరికి? స్త్రీకా పురుషుడికా?" అని ప్రశ్నించాడు.

"పురుషుడే. అందులోనూ ఎనుబోతులాటివాడు. ఎద్దుబండి దామోదరుడు. ఇంతకు అరగంట ముందే దుక్కలా నడుస్తూ లోపలికి పోయాడు. ఇంతలోనే ఏ రోగం ముంచుకొచ్చిందో నా కాశ్చర్యంగా వుంది. డాక్టరుగారు ఓ పావుగంట

ందు గదినుంచి బయటికి వచ్చి, రోగు లెవర్నీ లోపలికి పంపవద్దనీ, ఏవో ఆపరేషన్ పనిలో వున్నాననీ చెప్పారు,'' అన్నాడు నౌకరు.

"సరే, సాయంకాలం వస్తాను ఆ ఆపరేష నేదో అయింతరవాత డాక్టరు గారితో, డిటెక్టివ్ ఖండేరావ్ వచ్చిపోయాడని చెప్పు," అంటూ ఖండేరావు బయలుదేరి, లాల్‌దాసు నిలబడివున్న చెట్టుదాపులకు పోతూనే సిగరెట్ బయిటికి తీసి, అగ్గిపెట్టెకోసం జేబులు తడువుకుంటున్నట్టు తడువుకుని, లాల్‌దాసు దగ్గిరకు వెళ్ళి, "క్షమించాలి; మీ దగ్గిర అగ్గిపెట్టేమైనా వుందా ?" అని అడిగాడు.

లాల్‌దాసు, అతడికేసి గుర్రుగా చూసి, ''ఆఁ, వున్నది," అంటూ జేబులోంచి అగ్గిపెట్టె తీసి, డిటెక్టివ్ కిచ్చాడు. ఆ సమయంలో ఖండేరావు అతడి రెండు చేతులను బాగా పరీక్షించి చూశాడు. రెంటికీ అయిదేసి వేళ్ళున్నవి. అంటే, నరోత్తమదాసు ఇంట్లో నాలుగు వేళ్ళగుర్తులు వదిలినవాడు వీడు కాదన్నమాట. వాడు, దామోదరుడై వుంటాడా ?

''థాంక్స్ ! క్షమించాలి. మీ మిత్రుడు దామోదరుడి మరొకవేలుకూడ డాక్టర్ గోకుల్‌దాసు ఆపరేషన్ చేసి తీసివేస్తున్నట్టున్నది,'' అన్నాడు.

ఆ మాట వింటూనే లాల్‌దాసు కళవెళపడి, అంతలోనే సర్దుకుని, ''ఆ దామోదరుడు నాకు మిత్రుడు కాదు. బండిచక్రంకింద పడి లోగడ ఒకవేలు పోయింది. ఇప్పుడు డాక్టరు వాడి చెయ్యి ఆపరేషన్ చేసినా, నాకు పోయేదేం లేదు. నేను బాకీ వసూలు చేసుకునేందుకు, వాడీ ఇంటినుంచి బయటి కెప్పుడొస్తాడా అని చూస్తున్నాను. వాడు వారం రోజులుగా ముఖం తప్పిస్తున్నాడు," అన్నాడు.

''జాగర్త అతడు దొడ్డిదారినుంచి పారిపోయేను," అంటూ ఖండేరావు కదిలాడు.

"అలాంటి భయం ఏమీలేదు. ఆ కొంపకు దొడ్డిదారి లేదని నాకు తెలుసు," అన్నాడు లాల్‌దాసు ధీమాగా.

ఆ తరవాత మిట్టమధ్యాహ్నం వేళవరకూ లాల్‌దాసు అదేచెట్టుకింద నిలబడి తన మిత్రుడు గోకుల్‌దాసు ఇంటినుంచి డబ్బు తీసుకుని బయిటికి వస్తాడేమో అని కాపుకాచాడు. కాని, దామోదరుడు రాలేదు. లాల్‌దాసుకు మొదట విసుగూ, తరవాత ఎక్కడలేని భయమూ కలిగింది. ఆ ఇద్దరూ కలిసి నరోత్తమదాసుహత్యానేరం తనమీద ఆరోపించేందుకు ఏమైనా ఎత్తుగడలు ఆలోచిస్తున్నారేమో అనుకున్నాడు. కాని, దామోదరుడు మిత్రద్రోహానికి తలపడడన్న నమ్మకం అతడి కున్నది. బహుశా, దామోదరుణ్ణి డాక్టరు ఏ గదిలోనో బంధించివుంటాడు ! తాను పోలీసుల సహాయం కోరితే ? బాబోయ్, దాన్తో డొంకంతా కదులుతుంది...

లాల్‌దాసు తలా తోకా లేని యిలాంటి ఆలోచనల్తో కొంత సేపు సతమత చివరకు డాక్టర్ ఇంటివెనక వుండే ప్రహరీగోడ దూకి దామోదరుడు పారిపోయి దేమో అన్న సరికొత్త అనుమానం కలగడంతో, ఆదరా బాదరా అతడి ఇంటికి వెళ్లాడు. కాని, అక్కడ దామోదరుడి భార్య భాను తనభర్త ఇంతవరకూ ఇంటికి రాలేదని చెప్పటమేగాక, ఏవరో పోలీసుమనిషిలా వున్నవాడు ఉదయాన తనింటికి వచ్చి, దామోదరుడికోసం అడిగాడని తెలియపరిచింది.

"మీ యిద్దరూ పొద్దున్నే కలిసే పోయారుగదా! యిప్పుడొచ్చి ఏమయ్యాడని న న్నడుగుతావేం? ఆ సంగతి నీకే తెలియాలి. ఎక్కడికెళ్ళాడో చెప్పు," అంటూ భాను కేకలు ప్రారంభించింది.

లాల్‌దాసు ఆమెను పెద్దగా మాట్లాడవద్దని బతిమాలి, "కారణం ఏమిటో నాకు తెలియదు. నీ మొగుడు డాక్టర్ గోకుల్‌దాసుతో మాట్లాడివస్తానని అతడియింటికి వెళ్ళాడు. నేను బయట అతడికోసం యిప్పటిదాకా నిలువుజీతం వుండి, యిదే రావటం. ఆ డాక్టరు ఏదో హత్యకేసులో చిక్కుకున్నట్టు కనబడుతుంది. మనం దామోదరుడు ఆ ఇంట్లో వున్నాడని పోలీసులకు రిపోర్టిస్తే, అతణ్నికూడా కేసులో యిరికించేందుకు చూస్తారు. పొద్దుకూకనియ్; ఒకఎత్తు ఆలోచించాను," అన్నాడు లాల్‌దాసు.

భాను ఎన్నిసార్లడిగినా, ఆ ఎత్తేమిటో రాత్రి పదిగంటలవరకూ, లాల్‌దాసు ఆమెకు చెప్పలేదు. ఈలోపల ఆమె నడిగి రెండు టీలు తాగాడు. రాత్రి తొమ్మిది గంటలకు సుష్టుగా అక్కడే భోజనం చేశాడు. ఒకసారి పోయి డాక్టరింటిచుట్టూ తిరిగొచ్చాడు.

"ఇక బయలుదేరు భానూ. ఆ డాక్టరుగాడు దామోదరుణ్ని ఏ గదిలో దాచాడో ఆ గది కనుక్కున్నాను. అది మేడ పైభాగాన వున్నది. కిటికీలోంచి వెలుగు బయిటికి కనబడుతున్నది. ఆ గది కిటికీలోంచి లైటు పడటం ఏనాడూ నేను చూడ లేదు. అది సామాన్ల కొట్టని నాకు తెలుసు. కిటికీచువ్వలు కోయటానికీ, తాడుకట్టి దామోదరుణ్ణి అక్కణ్నించి రోడ్డువెపుకు దించటానికీ, అవసరం అయిన సామా న్లన్నీ నా దగ్గిర వున్నవి," అన్నాడు లాల్‌దాసు.

భాను వస్తుతః ధైర్యవంతురాలు. ఇప్పుడు తన భర్త స్నేహితుడు చెప్పేదాన్ని బట్టి తనమొగుడు ఎరిగో ఎరక్కో ఏవో చిక్కుల్లో పడ్డాడు. లాల్‌దాసు చిన్న చిన్న కన్నపుదొంగతనాల్లో ఆరితేరిన ఘటం అని ఆమెకు తెలుసు. ఈ అన్ని కారణాలవల్లా ఆమె నిర్భయంగా అతడివెంట బయలుదేరింది.



ఇద్దరూ చీకటిమాటున డాక్టరు గోకుల్‌దాసు ఇంటి పక్కభాగానికి పోయారు. మేడ పైభాగాన వున్న కిటికీనుంచి వెలుగు కనబడుతున్నది. వీధి పక్కనున్న ఒక రావిచెట్టుకొమ్మలు ఆ కిటికీ పక్కగా పరుచుకుపోయి, గాలికి కిర్రుకిర్రు మంటు న్నవి. లాల్‌దాసు కిటికీ కమ్ములు కోయటానికి వెంట తెచ్చుకున్న రంపం, చిన్న గునపంలాంటివి వున్న సంచీని భుజానికి తగిలించుకుని, పెద్ద మోకొకదాన్ని విప్పి, ఒకచివర నడుంకు కట్టుకుని, రెండోచివర భాను కిస్తూ, "నువ్వేమీ అలికిడి చేయకుండా యీ చీకట్లో నిలబడివుండు. పని పూర్తి కాగానే నేను సైగ చేస్తాను. అప్పుడు నువ్వు మోకుకొసను చెట్టుబోదెకు కట్టెయ్యి. మేం దిగివచ్చేప్పుడు మోకు ముడి వూడిపోకుండా, జాగర్తగా పట్టుకునివుండు," అంటూ రావిచెట్టు మీదికి గబగబా ఎక్కిపోయాడు.

రెండుమూడు నిమిషాలు గడిచినై. లాల్‌దాసు కిటికీవైపుకు పరుచుకుపోయిన ఒక రావికొమ్మమీదుగా పాకుతూ పోయి, కిటికీని సమీపించగానే, జాగర్తగా లేచి నిలబడి, ఒకచేత్తో చువ్వలు పట్టుకుని గదిలోకి తొంగిచూశాడు.

గదిమధ్య మంచం ఒకదానిమీద ఎవరో ముసుగు కప్పుకుని పడుకునివున్నారు.



చూస్తూనే అది దామోదరుడని లాల్‌దాసు నిశ్చయించుకున్నాడు. ఆవెంటనే అతడు మోకును కిటికీచువ్వలకు బిగించి, సంచీలోంచి రంపం బయిటికి తీసి, చువ్వలు కోయబోతూ, దామోదరుణ్ణి లేపితే సహాయంగా వుంటాడని ఆలోచన రాగానే, చువ్వల మీద రంపంతో మెల్లిగా కొడుతూ, "దామోదరా! దామోదరా!" అని పిలిచాడు.

మూడో పిలుపుకల్లా మంచంమీద పడుకునున్న ముసుగుప్రాణి, ఒక్క ఊపుతో దుప్పటిని తన్నేసి, "రక్షించండి. డాక్టరు చంపుతున్నాడు!" అంటూ లేచి

బడింది. అదెవరోకాదు, జినాబాయి! చిక్కి శల్యంలా అయిపోయి, విరబోసుకున్న జుట్టుతో, లోతుకు పోయిన కళ్ళతో పిశాచిలా వున్నది. తన రహస్యం బయట పెడుతుందేమోనన్న భయంతో డాక్టరు గోకుల్‌దాసు ఆమెను వైద్యంచేసే నెపం పెట్టి, ఆ సాయంకాలమే నరోత్తమదాసు ఇంటినుంచి తనఇంటికి తీసుకువచ్చాడు.

కటికచీకటి, కాళ్ళకింద గాలితాకిడికి వూగిసలాడుతున్న చెట్టుకొమ్మ, తను ఆశించిన దామోదరుడుకాక మరెవరో భూతంలాంటిమనిషి పక్కమీంచి లేచి, హత్య అంటూ అరవటంతో, లాల్‌దాసు భయకంపితుడైపోయి ఒక్కత్రుటికాలం పట్టుకున్న కిటికీచువ్వ వదిలాడు. మరుక్షణం అతడు ఇరవై అడుగుల ఎత్తునుంచి దభీమంటూ కిందపడిపోయాడు. భాను పరుగెత్తుకునివెళ్ళి అతణ్ణి పట్టుకుని నిలబెట్ట టానికి ప్రయత్నించింది, కాని లాల్‌దాసు ఒక్కసారి మూలిగి వెనక్కి విరుచుకు పడిపోయాడు. గుండెలు బాదుకుంటూ, ఆచీకట్లోపడి ఇంటికేసి పరిగెత్తింది.

## 5

మరుసటిరోజు తూర్పు తెల్లవారుతూనే లాల్‌దాసు శవాన్ని దారే పోయేవాళ్ళు చూసి, ఆసంగతి పోలీసుస్టేషనులో చెప్పారు. క్షణాలమీద పోలీసులూ, డిటెక్టివ్ ఖండేరావూ అక్కడికి వచ్చారు. వార్త తెలియవచ్చినప్పుడు, ఖండేరావు పోలిస్ స్టేషన్‌లోనే వున్నాడు. అతడు ప్రైవేట్ డిటెక్టివ్ అయినా, పోలీసు డిపార్ట్ మెంటులోని కొందరు ముఖ్యులతో పరిచయమూ, కొంత పలుకుబడీకూడా వున్నది

లాల్‌దాసుశవం, అతడు దొంగతనానికి ఉపయోగించే పరికరాలూ చూస్తూనే, పోలీసుఇనస్పెక్టరు, "వీడు దొంగతనానికి వచ్చి, డాక్టరు గోకుదాసు ఇంటి పై అంతస్తు గదికిటికీలు కోయటోయి, అక్కణ్ణించి కాలుజారి కిందపడి చచ్చినట్టుంది," అన్నాడు.

డిటెక్టివ్ ఖండేరావు, ఇనస్పెక్టరును జనంనుంచి కొంచెందూరంగా తీసుకుపోయి, "చెట్టుటోదెకూ దొంగనడుముకూ తాటిమోకు బిగించివున్నది. దానిప్రయోజనం ఏమై వుంటుదో ఆలోచించారా?" అని అడిగాడు.

"ఇందులో ఏదో రహస్యం వున్నట్టు కనబడుతోంది. అసలు వీడిపేరూ, పాతకేడీ అవునోకాదో తెలిస్తేతప్ప, ఆలోచించి ఒక నిర్ణయానికిరాలేం," అన్నాడు ఇనస్పెక్టరు.

"వీడు పాతకేడీ అవునోకాదో నాకు తెలియదు; పేరుమాత్రం లాల్‌దాసు. ఇతడి స్నేహితుడైన బండివాడు దామోదరుణ్ణిగురించే నేను యింతకుముందు స్టేషన్‌లో

చెప్పింది. అన్ని వివరాలూ మీకు చెబుదా మనుకునేలోపల, యీ చావుకబు తెలిసి హడావిడిగా వచ్చేశా," నన్నాడు ఖండేరావు.

"అయితే మీకు నరోత్తమదాసు యింట్లో జరిగిన ఆత్మహత్యా, నరోత్తమదాసు దేశాలుపట్టి పోవటంగురించీ వేరే అభిప్రాయా లున్నవన్నమాట. నరోత్తమదాసు హత్య అయాడు, కాని శవం మాయమైంది. కుడిచేతికి నాలుగు వేళ్ళే వున్న ఒక ఒంటెద్దుబండివాడు శవాన్ని బండిలో వేసుకుపోయాడు, అనేగదా మీరు యింతకు ముందు నాతో చెప్పింది. మున్నాబాయి విషంతాగి ఆత్మహత్య చేసుకోలేదు. విష ప్రయోగంతో చంపబడివుంటుంది, అనికూడా చెప్పారు. ఇవన్నీ ఆ బండివాడూ, వాడి స్నేహితుడైన యీదొంగా చేశారనా మీ నమ్మకం?'' అని అడిగాడు ఇనస్పెక్టరు.

''ఇన్ని భయంకర కార్యాలు యీ అల్పమానవులిద్దరూ చేసే శక్తిగాని, అవసరం గాని నాకు కనబడదు. కాని, హంతకుడికి వీళ్లు తోడ్పడ్డారనే అనుమానం నా కున్నది. ఏవిధంగా తోడ్పడ్డారు, అని ప్రశ్నిస్తే యిప్పుడు నేను తృప్తికరమైన జవా బివ్వలేను. ఒకటిరెండు గంటలతరవాత మిమ్మల్ని స్టేషను కొచ్చి కలుసు కుంటాను. అప్పుడు మీ ప్రశ్నలకు బహుశా జవాబులు చెప్పగలను. ఒక ముఖ్య కార్యంలో మీ సహాయంకూడా అవసరంకావచ్చు,'' అన్నాడు ఖండేరావు.

"మీ రడగాలికావి ఎలాంటి సహాయమైనా చేస్తాను. నిజమైన హంతకుల్ని పట్టిస్తానంటే, వద్దనే పోలీసుఇనస్పెక్టరెక్కడైనా వుంటాడా? పైగా, డిటెక్టివ్‌గా మీ శక్తిసామర్థ్యాలు నాకు తెలియనివికావు. మన పరిచయంకూడా యీనాటిదికాదు," అంటూ ఇనస్పెక్టర్ చిరునవ్వునవ్వాడు.

''సరే మళ్ళీ కలుసుకుంటాను. ఈలోపల శవపంచాయితీ, ఆ గొడవలన్నీ ముగించుకోండి," అని ఖండేరావు, సరాసరి దామోదరుడి ఇంటి కెళ్ళాడు.

నాలుగైదుసార్లు పెద్దగా పిలిచి, గట్టిగా తలుపు తట్టింతరువాతగాని, దామోదరుడి భార్య భాను తలుపు తెరవలేదు. ఖండేరావు ఆమెను చూస్తూనే, ఏదో పెద్దదుఃఖంలో వున్నదని గ్రహించాడు. అతణ్ణి చూసీ చూడగానే ఆమె నిలువెల్లా వణక సాగింది.

"భయపడుకు! సహాయం చేద్దామని వచ్చాను," అన్నాడు ఖండేరావు, ఇంట్లోకి అడుగు పెడుతూ.

''మీరు పోలీసులు, అవునా?'' అన్నది భాను వణుకుతున్న గొంతుతో.

''నేను పోలీసును కాను. అయినా నీకు వాళ్ళంటే అంత భయం ఎందుకు? నీవు ఏం నేరం చేశావ్?" అని అడిగాడు ఖండేరావు తాపీగా.

ఆ ప్రశ్న వింటూనే భాను పైటచెంగు ముఖానికి అడ్డం పెట్టుకుని వెక్కి-వెక్కి ఏడ్వసాగింది. ఖండేరావు లాలిస్తున్నట్టు, ''ఏ ద్చేం ప్రయోజనం, భానూ? నీ మొగుడు కనబడకుండా పోవటానికి కారకుడు, ఆ చిల్లరమల్లర దొంగ లాల్‌దాసు. ఆ వెధవ, డాక్టర్ గోకుల్‌దాసు ఇంటికి దొంగతనానికి పోయి, మేడమీంచి కిందపడి చచ్చాడు," అన్నాడు.

"లాల్‌దాసు దొంగతనానికి పోలేదు. నా మొగుడున్న చోటు తెలుసుకుని..." అంటూ భాను తను చెప్పగూడని మాట చెప్పానని తెలుసుకుని తక్కున ఆగిపోయింది.

డిటెక్టివ్ ఖండేరావుకు లాల్‌దాసు మరణం వెనకవున్న రహస్యం కొంతవరకు అర్థమయిపోయింది. అతడి కొక్కటే చిన్న సంశయం; భానుకూడా రాత్రి లాల్‌దాసు వెంట వున్నదా?

"వాడు చచ్చేముందు నీ మొగుడు ఆ మేడమీది గదిలో వున్నాడని చెప్పాడా?" అని అడిగాడు ఖండేరావు.

భాను కొంచెం సేపు తటపటాయించి, చివరకు తెగించినదానిలా, మీ రెవరైనా నాకు భయంలేదు; నా మొగుడు అమాయకుడు. నేను చేసిన నేరం ఏమీ లేదు. లాల్‌దాసు, గోకుల్‌దాసు మేడమీది గదిలో నా మొగుణ్ణి, ఆ దుర్మార్గుడు బంధించాడని చెప్పాడు. విడిపించుకురావటానికి రాత్రి మేం యిద్దరం వెళ్ళాం. లాల్‌దాసు చెట్టుకొమ్మల మీదుగా కిటికీదాకా వెళ్ళి, కాల్జారి కిందపడ్డాడు. నేను కదిలించి చూసి, ప్రాణం పోయిందని తెలుసుకుని ఇంటికి పారిపోయివచ్చాను. నా మొగుణ్ణి కాపాడేవా శ్ళెవరూ లేరు. ఆ దుర్మార్గుడు డాక్టరు ఆయన్ని చంపేస్తాడు." అని చెప్పి భోరు మన్నది.

ఖండేరావు ఆమెను సముదాయిస్తూ, "నేను చెప్పినట్టు విన్నావా, నీ మొగుణ్ణి అక్కణ్ణించి ప్రాణాలతో బయటకి తేవచ్చు. ఏమంటావ్?'' అని అడిగాడు.

''నా మొగుడికోసం ఏం చేయమన్నా చేస్తాను,'' అన్నది భాను ఆశగా.

"అలా అన్నావ్, బావుంది. నీ మొగుణ్ణి డాక్టర్ గోకుల్‌దాసు తన ఇంట్లో ఎందుకు బంధించాడో లాల్‌దాసు నీకు ఏమైయినా చెప్పాడా?" అని అడిగాడు ఖండేరావు.

"ఆ సంగతి నాతో ఏం చెప్పలేదు."

"నీ మొగుడూ, లాల్‌దాసూ యీ మధ్య డబ్బు జల్సాగా ఖర్చు పెడుతున్నార నిజమేనా ?" అని ప్రశ్నించాడు ఖండేరావు.

"లాల్‌దాసు సంగతి నాకు తెలీదు. నా మొగుడు మాత్రం ఎద్దుబండీమీద సంపాయించే అద్దెడబ్బులుమాత్రం రోజూ ఇంటికి తెస్తున్నాడు. అంతకుమించి ఒక్క దమ్మిడీ అతడిదగ్గిర అధికం లేదు," అన్నది భాను చిరుకోపంగా.

"అయితే లోకు లేదో అనవసరంగా నీ మొగుణ్ణి ఆడిపోసుకుంటున్నారు. వాళ్ళ చావు వాళ్ళని చావనీ; నీ మొగుడు నిన్నటి ఉదయం డాక్టర్ ఇంటికి వెళ్ళటం చూసినవాళ్ళ సాక్ష్యం ఉన్నది. నీవు చేయవలసిందల్లా ఏం లేదు; ఒక గంటా రెండు గంటల్లో బే డ్రస్సులో వున్న పోలీసు నొకణ్ణి నీ కోసం పంపు తాను. నీవు అతడి వెంట బయలుదేరి వచ్చి, డాక్టర్ గోకుల్‌దాసు ఇంటికి వెళ్ళి. నీ మొగుడు అక్కడ ఏం చేస్తున్నాడని అడుగు. బహుశా, అతడు దామోదరు డనే పేరుగలవాణ్ణి ఎవణ్ణీ చూడనుకూడా లేదంటాడు. అప్పుడు నీవు పోట్లాట పెట్టుకుని అల్లరి ప్రారంభించు. ఆ సమయంలో నేనూ, పోలీసువాళ్ళుం కొందరం వచ్చి, ఆ గోకుల్‌దాసు అంతు ఏమిటో కనుక్కుంటాం." అని చెప్పాడు ఖండేరావు.

భాను, డిటెక్టివ్ చెప్పిందంతా శ్రద్ధగా విని, అంగీకారంగా తలాడించింది. ఖండేరావు అక్కణ్ణించి బయలుదేరి పోలీసు స్టేషనుకు వెళ్ళి, ఇనస్పెక్టర్ను కలుసు కున్నాడు. అతడు, లాల్‌దాసు శవాన్ని శవపరీక్షకు పంపినట్టు చెప్పి, "ఒక సంగతి నా కాశ్చర్యం కలిగిస్తున్నది, ఖండేరావుగారూ! డాక్టర్ గోకుల్‌దాసుకు కబురు చేస్తే, ఇంట్లోనే వుండి లేనట్టు నౌకరుతో చెప్పి పంపాడు. అదే నౌకరు అంతకుముందు ఒక జవా నడిగితే, అతడు ఇంట్లోనేవున్నట్టు చెప్పాడు," అన్నాడు ఇనస్పెక్టరు.

"నా సలహా పాటించారంటే, ఆ డాక్టర్ను గురించిన మరికొన్ని సంగతులు తెలుసుకుని, మరింతగా ఆశ్చర్యపోతారు. మీ కతడితో కాస్తో కూస్తో పరిచయం వున్నదిగదా ?" అని అడిగాడు ఖండేరావు.

"లేకేం; ఒకటి రెండుసార్లు అతడిదగ్గిర మందుకూడా పుచ్చుకున్నాను." అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"అయితే, ఒక పోలీసుజవాన్ను, .. ఒంటెద్దుబండి దామోదరు డిల్లు ఎరిగిన వాణ్ణి, బేడ్రెసులో పంపండి. దామోదరుడి పెళ్లాం భాను అతడివెంట వస్తుంది. ఆమె డాక్టరింటిలో ప్రవేశించి గలాటా ప్రారంభించిన తరవాత, మనం ఆ దారెంట



పోతూ ఆ గోల విని ఏమిటో కనుక్కునేందుకు వచ్చినవాళ్ళలా అతడింట్లో జొరబడదాం. ఎందుకేనా మంచిది, వెంట రివాల్వరు తెచ్చుకోండి. సెర్చివారంటు లేకుండా అతడిఇల్లు నంతా మనం వెతకటానికి యిదొక్కటే మార్గం," అన్నాడు ఖండేరావు.

"వాడు పలుకుబడిగల మనిషి. మనం అనవసరంగా చిక్కుల్లో పడంగదా?" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"చిక్కుల్లో పడేది మనంకాదు, డాక్టర్ గోకుల్‌దాసు ! నా మాట నమ్మండి," అన్నాడు డిటెక్టివ్ ఖండేరావు.

* * * *

గంట తరవాత డిటెక్టివ్ ఖండేరావూ, ఇన్‌స్పెక్టరూ నలుగురు పోలీసుల్ని వెంటపెట్టుకుని వెళ్ళి, డాక్టర్ గోకుల్‌దాసు ఇంటి ప్రహరీగోడ ప్రాంతాల నిలబడ్డారు. దామోదరుడి భార్య భాను, డాక్టర్ ఇంటిలో ప్రవేశించి గలాటా చేయటం ప్రారంభించింది.

"నా మొగుడు నిన్న ఉదయం మీ దగ్గిరికి మందుకు వచ్చాడు. ఇంతవరకూ ఇంటికి తిరిగిరాలేదు. మీ ఇంట్లో ఏం చేస్తున్నాడు ?" అని అడిగింది ఆమె, గోకుల్ దాసును.

"నిన్న ఉదయంవేళ నా దగ్గిరికి ఎవరూ మందుకు రాలేదు. అసలు ఎవరు నువ్వు? ఆ వచ్చాడని చెప్పేవాడి పేరు ఏమిటి ?" అని ఎంతో కోపంగా ప్రశ్నించాడు గోకుల్‌దాసు.

"ఆ వచ్చినతని పేరు దామోదరుడు; నా భర్త. నాపేరు భాను. అతణ్ణి మీరు ఇంట్లో దాచేశారు, వదిలిపెట్టండి." అని అరిచింది భాను.

"నీ కేదో పిచ్చెత్తినట్టున్నది. తక్షణం యిక్కణ్ణించిపో," అంటూ గట్టిగా అరిచాడు గోకుల్‌దాసు.

"నా మొగుణ్ణి వదిలిపెట్టు. మా దారిన మేం పోతాం," అన్నది భాను.

"పిచ్చిగా వాగకు. నీ అలగావాగుడు నాదగ్గిర కాదు. పోతావా పోవా ? పోలీసుల్ని పిలపించమంటావా ?" అంటూ గోకుల్‌దాసు ఆమెమీదికి వచ్చాడు.

"పిలిపించు, అప్పుడుగాని నిజం బయటపడదు."

"నిన్ను బయిటికి నెట్టేందుకు పోలీసులుకూడా కావాలా ?" అంటూ గోకుల్ దాసు, భానుమెడ పట్టుకుని వెనక్కు నెట్టబోయాడు. అదే సమయంలో భాను, రెండు చేతులతో డాక్టర్ ముఖంమీద బలంగా గుద్ది, "వీడు నన్ను గొంతుపిసికి చంపుతున్నాడర్రో," అని పెద్దగా ఏడుస్తూ కేకలుపెట్టింది.

మరుక్షణం డిటెక్టివ్ ఖండేరావూ, ఇనస్పెక్టరూ పోలీసులతో అక్కడికి వచ్చారు. ఇన్‌స్పెక్టరు కోపంగా ముఖంపెట్టి, "ఏమి టీగోల డాక్టరుగారూ! ఆడ కూతుర్ని గొంతుపట్టుకోవటం ఏమిటి ?" అన్నాడు.

"ఇదేదో అలగాముండ. తన మొగు డెవడో దామోదరుడట, వాడు నా ఇంట్లో వున్నాడని గొడవచేస్తున్నది," అన్నాడుగోకుల్‌దాసు, ఖండేరావుకేసి గుర్రుగాచూస్తూ.



"వాడి పేరేమన్నారూ! దామోదరుడా? బతికించారు. ఒక దొంగతనం కేసులో వాడున్నాడు. వారం రోజులుగా తప్పుకు తిరుగుతున్నాడు. ఏమే, నువ్వాడి పెళ్ళానివా?'' అని భానూను అడిగాడు ఇన్‌స్పెక్టరు.

''అవునయ్యా! నా మొగుణ్ణి యీ డాక్టరు తనింట్లో దాచేశాడు. చంపేశాడేమో అనికూడా భయంగా వుంది,'' అంటూ భాను ఏడవసాగింది.

"ఏడవకు, ఏడ్చి లాభం ఏమిటి? నీ మొగుణ్ణి పట్టుకునేందుకు మేం నాలుగు రోజులుగా నగరం అంతా గాలిస్తున్నాం. ఈ ఇంట్లో దాగివున్నాడేమో వెతికి యిద్దరం అనుమానాలు తీర్చుకుందాం. డాక్టరుగారు చాలా పెద్దమనిషి. ఆయనమీద

లేనిపోని నేరారోపణలు చెయ్యకు. మా వెంట వచ్చి డాక్టరుగారి ఇంటి గదులన్నీ వెతుక్కో,'' అంటూ ఇన్‌స్పెక్టరు కదలబోయాడు.

"ఆగండి ఇన్‌స్పెక్టరుగారూ, ఆగండి! ఇదంతా యీ ప్రైవేట్ డిటెక్టివ్ ఖండేరావు ఎత్తుగడలా వున్నది. ఇతగాడు నరోత్తమదాసు మాయమైపోయిన కేసులో నన్ను యిరికించాలని చూస్తున్నాడు. దాసుతమ్ముడు జగన్నాధుడితో అతడు హత్య అయిపోయాడనికూడా చెప్పాడు. ఈ తెలివితక్కువడిటెక్టివ్ మాటలు నమ్మకండి,'' అన్నాడు గోకుల్‌దాసు.

"మనకు అతడితో ప్రసక్తి లేదు. ఖండేరావుగారు వేరేపనిమీద నాదగ్గరకొచ్చారు. ఇద్దరం మాట్లాడుకుంటూ పోతూండగా, మీ యింటి ఆవరణలోంచి కేకలు వినిపించినై. లోపలికి వచ్చాం, అంతే,'' అంటూ ఇనస్పెక్టరు ఇంటి ముఖద్వారం కేసి రెండడుగులు వేసేంతలో, డాక్టరు గోకుల్‌దాసు "ఆగండి!'' అంటూ భీకరంగా అరిచి, జేబులోంచి పిస్టల్ బయిటికి తీశాడు. అదేసమయంలో పక్కనున్న డిటెక్టివ్ ఖండేరావు కుడికాలు చాచి డాక్టర్ చేతిమీద గట్టిగా తన్నాడు. పిస్టల్ అతడి చేతిలోంచి ఎగిరి అంతదూరాన పడిపోయింది. దానికోసం డాక్టర్ పరిగెత్తబోయేంతలో, ఖండేరావు అతడి కుడికాలికి తన ఎడమకాలు అడ్డం పెట్టాడు. డాక్టర్ బోర్లాపడ్డాడు. ఖండేరావు అతడిమీదికి దూకి అతడి రెండుచేతులనూ వెనక్కు విరగదీసి పట్టుకుని, "వీడు హంతకుడు. ఇన్‌స్పెక్టరుగారూ! పారిపోకుండా చూడండి. మనల్ని ఇంట్లోకి పోకుండా ఆపేందుకు యితడు పిస్టల్ లాగిన తీరు చూస్తూంటే, ఒకటిరెండు శవాలు యిక్కడ కనబడతవని నాకు అనుమానం కలుగుతున్నది,'' అన్నాడు.

ఇంతలో ఇద్దరు పోలీసులు వచ్చి, డాక్టర్ గోకుల్‌దాసుపక్కన నిలబడ్డారు. ''ఎందుకైనామంచిది; పారిపోయే ప్రయత్నంమాత్రం చేయకండి, డాక్టరుగారూ!'' అని ఇన్‌స్పెక్టరు వెటకారంగా అని కదలబోయేంతలో, అంతకుముందు ఇంట్లోకి జొరబడిన ఒకపోలీసు గబగబా బయిటికి పరిగెత్తుకుంటూవచ్చి, ''సార్, సార్! ఆపక్కన తాళం వేసివున్న గదిలోంచి దుర్వాసన వస్తున్నది,'' అన్నాడు ఇన్‌స్పెక్టర్‌తో.

"డాక్టర్ చేతికి బేడీలు తగిలించండి. పారిపోకుండా అతిడి కొంకళ్లు కాపలా వుండి, మరొకళ్లు స్టేషనుకు పరిగెత్తి సర్కిల్‌ఇన్‌స్పెక్టరుకు విషయం చెప్పి, మేజిస్ట్రేటును వెంటబెట్టుకు రమ్మనండి. మధ్యవర్తులూ, పై ఆఫీసర్లూ లేకుండా గదితాళం బద్దలుకొట్టటం బావుండదు,'' అన్నాడు ఇన్స్‌పెక్టరు, డిటెక్టివ్ ఖండేరావుకేసి చూస్తూ. అవునన్నట్టు ఖండేరావు తలవూపి, మిద్దెమీది గదికేసి చరచరా

పరిగెత్తాడు. అతడికి డాక్టర్ గోకుల్‌దాసు ఇంట్లో ఒకటిని మించిన శవాలు వుండ వచ్చున్న అనుమానం కలిగింది.

## 6

పాపం పండి డాక్టర్ గోకుల్‌దాసు చేసిన ఘోరకృత్యాలన్నీ బయటపడినై. అతడి ఇంటి గదిలో ఒక ట్రంకుపెట్టెలో దొరికిన శవం ఒంటెద్దుబండి తోలుకునే దామోదరుడిదని గుర్తించబడింది. మేడమీది గదిలో జ్వరంతో చావుబతుకుల మధ్యవున్న డాక్టరు ప్రియురాలు జినాబాయి - డాక్టరు ప్రోద్బలంమీద తానే చేశానని - నేరమంతా ఒప్పుకున్నది. అంతేకాక నరోత్తమదాసు భార్య మున్నాబాయికీ, డాక్టర్ గోకులదాసుకూ వున్న రహస్యసంబంధం గురించి చెప్పి, అతడు మున్నాబాయికి విషప్రయోగం చేసిన తీరంతా వివరించింది. ఆమెకు తెలియని సంగతేమిటంటే - నరోత్తమదాసు శవం మాయంకావటం. అది మరో ఇరవైనాలుగ్గంటల కాలం డిటెక్టివ్ ఖండేరావుతోపాటు, పోలీసులకూ కూడా అంతుచిక్కని నిగూఢ రహస్యంగానే వుండిపోయింది.

కాని, ఆతరవాత ఒకనాటి ఉదయం నరోత్తమదాసు గుర్రబ్బండీలో తన ఇంటికి వచ్చి దిగాడు. అతనికి తోడుగా ఒక డాక్టరూ, నర్సూ వచ్చారు. అతణ్ణి సజీవుడుగా చూసి, జగన్నాథ నరోత్తమదాసు పొందిన ఆశ్చర్యం, ఆనందం అంతా యింతాకాదు. రఘునాథ నరోత్తమదాసు, తన తమ్ముడికీ, ఆ డిటెక్టివ్ ఖండేరావుకూ తనను శ్మశానం దగ్గర పాడుబడిన కొంపలో ఏవరో పడవేసి పోయిన తరవాత ఒక సన్యాసి తనకు చేసిన చికిత్సా, తను కొంచెం మాట్లాడ ప్రారంభించగానే, అతడు తనను భుజాన వేసుకుపోయి, ఒకానొక డాక్టర్ ఇంటి ముందు వదిలిపోవటం, ఆ డాక్టరు తనను నర్సింగ్‌హోంలో చేర్చుకుని, మందిస్తూ యీ నాలుగైదురోజులూ రహస్యంగా కాపాడటం - అంతా చెప్పాడు.

కోర్టులో నరోత్తము డిచ్చిన సాక్ష్యమూ, జినాబాయి వాఙ్మూలమూ, భానూ, డిటెక్టివ్ ఖండేరావులు చెప్పినదంతా విన్నతరువాత న్యాయాధిపతి, డాక్టర్ గోకుల్ దాసుకు ఉరిశిక్షా, జినాబాయికి నాలుగేళ్ళ ఖైదూ విధించాడు. అంతేకాదు, విధవ అయి బతుకుతెరు వేమీ లేకుండాపోయిన భానూకు, డాక్టర్ గోకుల్‌దాసు ఆస్తి వేలం వేయగా వచ్చినదాంట్లో నాలుగోవంతు యివ్వవలసిందిగా తీర్పు చెప్పాడు.

డిటెక్టివ్ ఖండేరావుకు జగన్నాథు డిస్తానన్న రెండువేల రూపాయలతో పాటు, నరోత్తమదాసు మరి నాలుగువేలరూపాయిలు కలిపి యిచ్చాడు. డాక్టర్ పేరుతో చెలామణీ అవుతున్న ఒక నరరూపరాక్షసుడు ఉరికంబం ఎక్కటం విని, నగరం లోనివాళ్ళందరూ పరమానందభరితు లయారు.

# ఎగిరిపోయింది

ఆ పిట్ట పేరు మంజుల.

ఎండా వానా ఎట్లా ఉంటుందో తెలియకుండానే పెరిగింది. విచారమూ, దుఃఖమూ అనే మాటల్ని ఆమె ఇన్నాళ్ళూ వినలేదు. చూట్టానికి పద్దెనిమిదేళ్ళ దానిలా కనిపించినా ఆమె మనసుకి ఎనిమిదో ఏడు ఇంకా నిండలేదు. ఆమె చాలామందికన్న అందంగానే వుంటుంది. ఆమెకి, చాలా మందికన్న డబ్బెక్కువగానే వుంది.



అయితే,

ప్రజలంతా మహా సుఖపడిపోతున్నారనీ, నాకే ఈ కష్టాలన్నీ వున్నాయనీ నేనూ మీరూ అనుకొన్నట్టే ప్రస్తుతం ఆ పిల్లకూడా అనుకుంటోంది.

పదిహేడేళ్ళ క్రితం ఆ అమ్మాయి తండ్రి నాగపూర్‌లో డాక్టర్ చదివేడు. భార్యకి దూరంగా వుండటం వల్లనో ఏమో, అతడు పరస్త్రీలని తల్లులుగా భావించలేదు. అందరిలానే తననీ మోసం చేశాడనే కోపం కొద్దీ ఓ నర్సు చేతి కందుబాటులో వున్న పాయిజన్ని అతని కాఫీకప్పులో కలిపేసి ఆ పిల్లని తండ్రిలేనిదానిగా చేసింది. అప్పటిదాకా అతను తనవాడేననే భ్రమలో వున్న ఆ అమ్మాయి తల్లి, జరిగిందంతా తెలిసి, అవమానాన్నీ, దుఃఖాన్నీ భరించటం చాతకాక ఉరేసుకుని చచ్చిపోయింది.

తాతయ్య నెత్తీ నోరూ బాదుకుంటూ ఎంత చెప్పినా, ఏడాది పిల్లకి ఈ అనర్థాలేవీ అర్థం కాలేదు. ఆయనే తల్లి అనుకుని, తాతయ్య మీసాలతో ఆడుకుంటూ చకచకా పెరిగిపోయి పద్దెనిమిదేళ్ళ అమ్మాయంత అయింది.

తాతయ్య సంపాదించిన డబ్బు ఇంకో రెండు తరాలదాకా తరగదు.

నకనే ఆ పిల్లకి ఎన్నడూ ఏ లోటూ గానివ్వలేదు. తాతయ్యకి ఆమె ంకా బేబీయే. అందుకనే ఆమెకి పెళ్ళి చెయ్యాలనే ఆలోచన రాలే గాయనకి. స్కూల్లో వున్నదంతా కేర్చేసుకున్నాక కాలేజీలో చేర్పిం కేడు. నోట్సంతా రాయటానికి ఓ ంతులమ్మనీ, రాసిందంతా చదివి నిపించటానికి మరో పంతులమ్మనీ పెట్టేడు. కాని ఆమె అమాయ త్వాన్ని పోగొట్టటానికి ఏ పంతు మ్మనీ పెట్టలేదు. ఆ పిల్ల ఆటల్నీ పాటల్నీ చూసి సంతోషిస్తున్న ఆయనకి తన వయసు విషయం గుర్తుకి రాలేదు. తను పోయ్యాక ఆమె ఏమవుతుందని ఏనాడూ ఆలోచించ లేదు.

ముసలివాళ్ళు, మనవరాళ్ళకు పెళ్ళిళ్ళయి పిల్లల్ని కనేదాకా బ్రతికి వుండటమనే రివాజు లేకపోవటాన, ఏదో జబ్బుచేసి ఆయన పోగేడు. ఆయన దిగుల్తో పోకుండా శ్రీమ న్నారాయణ ఆమెను కాపాడేడు. అమ్మాయి బాధ్యతంతా తాను తీసు కుంటానని ప్రామిస్ చేశాడు. చదరం గంలో నిత్యమూ తనని వోడించే శ్రీమన్నారాయణని నమ్మి ఆయన నిశ్చింతగా వెళ్ళిపోయేడు.

ఇదంతా జరిగిపోయిన కథ.

శ్రీమన్నారాయణా, సారథీ వేళ్వే రుగా ఆమెని ఓదార్చి ఆరునెలల్లో తాతయ్యని మర్చిపోయేట్టు చేయగలి గారు. ఆయ నిక మళ్ళీ తిరిగిరాడని రూఢిగా తెలిశాక ఏడవటం మానే సింది మంజుల. సారథితో కలిసి మామూ లుగా సినిమాలూ అవీ చూస్తోంది. కుక్కపిల్లతో ఎప్పటిలాగే ఆడుకుం టోంది. కాలేజికి వెళ్ళటం మానేసింది. సారథి ఆఫీసుకి వెళ్ళినప్పుడు కాలక్షే పానికి నావెల్స్ చదువుకుంటోంది.

సారథి మంజుల చదివిన కాలేజి లోనే చదివాడు. మంజులకన్నా సీనియర్ కావటంతో చదువు పూర్తి చేసేసుకుని, ఇన్నాళ్ళూ చదువుకింద ఖర్చు చేసిన డబ్బులో కొంతైనా ఉద్యోగం ద్వారా సంపాదించాలని ప్రయత్నిస్తున్నాడు. సారథి ఉన్నవా డేం కాదు. ఆంధ్రదేశంలోని ఒకా నొక పల్లెటూళ్ళో అతనికి ఓ తల్లీ, పెళ్ళి కావాల్సిన చెల్లెలూ, కూలిపోవ టానికి సిద్ధంగా వున్న ఓ కొంపా తప్ప మరేంలేదు. ఇప్పుడిప్పుడే మంజుల కూడా వున్నదని అనుకుంటున్నాడు. మంజుల అత న్నిష్టపడటానికి అతని కున్న అర్హతల్లో మంచి మనసొక్కటి. ఈ పట్నంలో తన జీతంతో తల్లినీ, చెల్లెలినీ భరించలేడు. కనక వాళ్ళని పల్లెలోనే వుంచి నెల కింతని పంపిస్తు న్నాడు. రాబోయే రోజుల్లో చెల్లెలి పెళ్ళి చెయ్యాలనీ, తరవాత తను

మంజులని చేసుకోవాలనీ కలలు కంటున్నాడు. మంజులకి ప్రస్తుతం వున్న పెద్దదిక్కల్లా శ్రీమన్నారాయణ. మంజులని పెళ్ళాడాలంటే అతన్ని మంచిచేసుకోవాల్సిన అవసరం వుందని అతను మర్చిపోయేడు.

తాతయ్య బ్రతికి వున్నప్పుడు చదరంగం ఆడటానికో, అప్పు అడగటానికో శ్రీమన్నారాయణ తరచూ ఆ ఇంటికి వొచ్చేవాడు. ఇప్పుడు మంజుల బాధ్యతంతా తనమీదే వేసుకోటంతో తన పెళ్లాం పిల్లల్ని తనింట్లోనే వుంచి కట్టుబట్టలతో ఆ ఇంటికి వొచ్చి మంజుల డబ్బుతోనే బట్టలు కుట్టించేసుకున్నాడు. మంజుల తనని "మామయ్యగారూ" అని పిలవటంతో తనకు ఎదిగొచ్చిన మగపిల్లలేనందుకు విచారించి, ఆమెకు మంచిమొగుణ్ని తెచ్చే ప్రయత్నంలో వున్నాడాయన మంచిమొగుడి లక్షణా లెలా వుండాలో ఆయన ఏనాడో నిర్ణయించుకున్నాడు. మంజుల కాకపోయినా కనీసం తనకయినా విధేయుడు వుండే వరుడికొరకు ఆయన వేట సాగించేడు.

అయితే, ఆయన చేసిన పొరబాటేమిటంటే – మంజులకు ఈ విషయం తెలీనివ్వకుండా ఉంచటం. ఆ అమ్మాయితో "అమ్మా! ఇట్లా నీకొరకు మొగుడిని వెదుకుతున్నాను," అని చెబితే ఆ పిల్ల తొందరపడి సారథిని ఎన్నుకోకపోయేదేమో!

సారథి మాటిమాటికీ మంజుల కోసం రావటం శ్రీమన్నారాయణకేం నచ్చలేదు. హాల్లో కూర్చునివున్న తనని మాటవరుసకేనా పలకరించకుండా మెట్లెక్కి పైకెళ్ళిపోయే సారథిని. చూస్తే ఆయనకి మంట వాళ్ళిద్దరూ మేడమీదినుండి కిందికి వినవొచ్చేలా నవ్వటమూ వగైరాలు కూడా ఆయన కోపం తెప్పించాయి.

"పా పా! ఈ సారథి వున్నాడు చూశావ్! అలాగ కనిపిస్తాడు కాని దేవాంతకుడు. నీకు చెప్పకూడదు కానీ చాలా ఘనకార్యాలు చేశాట్ట ఇతను. మొన్న వాళ్ళవీధిలో అనుకుంటుంటే విన్నాను. నువ్వా అమాయకురాలివి. పెళ్ళి కావల్సినదానివి. నీదగ్గిరున్న డబ్బంటే ఇష్టం ఇలాంటి వాళ్ళకి. అతన్తో చనువుగా వుండటం కాస్త తగ్గించు," అని ఓపిక పూర్తిగా పోయిన ఒకరోజున మంజులతో చెప్పాడు.

మంజులకి కొంచెం కోపం వొచ్చినా, ఆయనపట్ల వున్న గౌరవంవల్ల "సరే మామయ్యగారూ!" అనేసి వెళ్ళిపోయింది.

పిల్లది తనమాటకి విలవ ఇచ్చిందన్న సంతోషం ఆయనకి ఎక్కువసేపు నిలవలేదు. ఓ గంట పోయాక సారథి రావటమూ, ఎప్పటిలాగే వాళ్ళిద్దరూ అల్లరి చెయ్యటం చూస్తూ నిస్సహాయముగా ఉండిపోయేడాయన.

రెండుమూడు రోజులు తీవ్రంగా ఆలోచించి ఆయన ఓ నిర్ణయానికి వచ్చేడు. ఇలా తను కాలయాపన చేస్తూపోతే ఈ సారథిగాడు మంజులని వల్లోవేసుకోటంమాట ఖాయం అసలే అథమూ శుభమూ తెలియనిపిల్ల; వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుందామని అనుకుంటే ఆపేందుకు ఎవరికీ దమ్ములుండవు. తననోట మట్టిగొట్టుకున్నట్టే అవుతుంది. అందుకని తను వరుని కై వేట వేగంగా సాగించకతప్పదు

ఆయన చేసిన నిర్విరామ పరిశ్రమ వల్ల రెండుమూడు రోజుల్లోనే సరైన చేప గాలానికి చిక్కుకుంది.

ఆ చేపని ఇతరులు దుర్గారావ్ అని పిలుస్తారు. దుర్గారావ్ బ్రతికిచెడ్డ మనిషి. తండ్రి వొదిలిపోయిన రెండు లక్షల ఆస్తినీ యథాశక్తి తాగుడుకీ, పేకాటకీ తగలేశాడు. ఇప్పుడు కూడూ గుడ్డా ఇస్తే బూట్లు పాలిష్ చేసేందుకైనా సిద్ధంగా వున్నాడు. ఇంత వరకు పెళ్ళి చేసుకుని యే ఆడపిల్ల గొంతుకా కొయ్యలేదు చేతిలో డబ్బాడినంతకాలం ఆ అవసరం అతడికి కనిపించలేదు. అతన్నిగురుంచి అంతా వాకబు చేసి, అతనంత మంచి వరుడు మంజులకి దొరకడని నిర్ణయించుకున్నాడు శ్రీమన్నారాయణ. అవును, ఇలాంటివాడయితేనే చెప్పుకింది తేలులా అణిగివుంటాడు.

ఒకరోజు ఉదయాన అప్పుడే నిద్ర లేచిన దుర్గారావ్, మొన్నరాత్రి కాల్చిపడేసిన సిగరెట్ పీకని తిరిగి అంటించుకునే సన్నాహంలో ఉండగా, అదృష్టం శ్రీమన్నారాయణ రూపంలో అతని గడపలో అడుగెట్టింది. అది నిజమయినా కాకపోయినా కనీసం అతనలా అనుకున్నాడు.

సహజంగా డబ్బు చేతిలో ఆడిన మనిషి కావటాన దుర్గారావ్ కి రాజసము తెచ్చిపెట్టుకోకుండానే వచ్చిపడింది. అతిథిని సగౌరవంగా లోపలికాహ్వానించి "ప్లీస్ బీ సీటెడ్" అని "మీ రేం తీసుకుంటారు, ఓవలా-కాఫీయా?" అనబోయి నాలిక్కరచుకుని "ఓ సిగరెట్ వుంటే ఆఫర్ చెయ్యండి," అన్నాడు గంభీరముగా మొహం పెట్టి.

శ్రీమన్నారాయణకి అతనిని చూస్తే ముచ్చటవేసింది. ఓడలు బండ్లు, బండ్లు ఓడలు కావటమంటే ఇదేను సుమీ! అనుకొన్నాడు. అనుకుని ఓ సిగరెట్ అతని కిచ్చి తనోటి వెలిగించుకుని తను వచ్చిన పనినిగురించి ప్రస్తావించాడు.

శ్రీమన్నారాయణ అనుకున్నట్టుగా దుర్గారావ్ ఎగిరి గంతెయ్యలేదు. కాని పులిక్కిపడ్డాడు. ఘాటుగా ఓ దమ్ము పీల్చి "ఓ ఐ సీ" అన్నాడు. మళ్ళీ "చూడండి సార్ ! మాది జమీందారీ

వంశం అన్న సంగతి నేను చెప్పకుండానే మీకు తెలిసివుంటుంది. మాకుతగ్గ కన్య ఐతేనే వివాహం చేసుకుంటాం. ఆమెని చూసిగాని ఏ సంగతీ చెప్పలేం," అన్నాడు.

శ్రీమన్నారాయణకి నవ్వొచ్చింది. "చూడుబాబూ! ముసుగులో గుద్దులాట లెందుకు? నీ సంగతి నువు పుట్టకముందునుంచీ నాకు తెలుసు. ఆ పిల్లని చేసుకొనేందు కెవడూ దొరక్క-నీ దగ్గరికి రాలేదు నేను. పిల్లపేరిట పదిలక్షల ఆస్తివుంది పెళ్ళయిన మరుక్షణమే అది నీపేర అయ్యేట్టు నేను చూస్తాను. ఆ ఆస్తి నీదయిన తక్షణం సగం నాకిచ్చేందుకు సిద్ధపడితేనే బేరం కుదురుతుంది మనమధ్య. ఇది పెళ్ళి సంబంధంకాదు, పక్కా బిజినెస్," అన్నాడు.

కాస్సేపు బెట్టు చెయ్యాలని చూశాడు దుర్గారావ్. కాని శ్రీమన్నారాయణ నువు కాకపోతే నీ బాబు లాంటి వాడింకొకడు అన్నట్లు మాట్లాడేసరికి చల్లారిపోయి ఒప్పేసుకున్నాడు. అత నొప్పుకున్న తక్షణం బజారుకి వెంటబెట్టుకుని వెళ్ళి, అతనికి కావల్సిన బట్టలు ఓ వెండి సిగరెట్ కేసూ, సెరిలిన్ షర్టులోంచి పైకి కనిపించేందుకో వందరూపాయిలనోటు ఏర్పాటుచేశాడు శ్రీమన్నారాయణ. రాజుగారి తమ్ముడికొడుకులా గడిపిన పూర్వపురోజులను జ్ఞాపకం చేసుకుంటూ అతనివెంట నడిచాడు దుర్గారావ్.

ఇద్దరూ ఇంటికి చేరేసరికి మంజుల సారథీ ఒకేసోఫాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. సారథి అక్కడ వుండటం అపశకునమేమో ననిపించింది శ్రీమన్నారాయణకి. జమీందార్ దుర్గారావ్ గారిని వాళ్ళకు పరిచయం చేసి, ఏదో పనున్నట్టు హడావిడిగా వెళ్ళిపోయ్యేడతను. తొందర్లో సారథిని గురించి అత డేమీ చెప్పకున్నా, మంజులకీ సారథికీ మధ్యవున్న దూరాన్ని కళ్ళతో కొలిచి, ఇతడు తన విలన్ కామోస నుకున్నాడు దుర్గారావ్.

ముగ్గురూ కలిసి రష్యావాళ్ళు అంతరిక్షంలోకి పంపిస్తున్న ఉపగ్రహాల గురించి కొంచెంసేపు మాట్లాడుకున్నాక, మంజుల టైం చూసుకుని లేచింది. "మేం మాటినీ ప్రోగ్రాం వేసుకున్నాం దుర్గారావ్ గారూ! టైం అయింది. మరోసారి కలుసుకుందాం లెండి!" అన్నది. దుర్గారా వేమీ మాట్లాడకముందే ఆత న్నొంటరిగా వదిలేసి ఇద్దరూ బయటికి వెళ్ళిపోయేరు.

దుర్గారావ్ అక్కడే కూచుని, ఏం చెయ్యాలో తోచక సారథికన్న తనలో ఎక్కువున్న వేమిటో, సారథిలో తన కన్న తక్కువున్న వేమిటో బేరీజు వేసుకోటం మొదలెట్టేడు. మంజులని ఆ

లన్ గాడితో ఒంటరిగా పంపించవలసి చ్చినందుకు తనని తానుతిట్టుకుంటున్న మ య ము లో శ్రీమన్నారాయణ లోపలికి వచ్చేడు. వెర్రి మొహం వేసు ుని కూర్చున్న అతన్ని చూసి జరిగిం దేమిటో గ్రహించటానికి ఆ యన కెక్కువసేపు పట్టలేదు. అత నేదో అన బోయ్యేలోపలే దుర్గారావ్ అందు ని "ఇదిగో సార్! వా డెవడూ, సారథిగాడు, వాడిక్కడికి వొస్తున్నంత కాలం నేర్రానాను. వొచ్చి ప్రయోజనం కూడా లేదు. వా ణ్ణెక్కడికేనా పంపిం చినా సరే, అస ల్లేకుండా చేసినాసరే!" అన్నాడు.

ఇన్నాళ్ళూ ఈ ఉపాయం తట్టనం దుకు శ్రీమన్నారాయణ విచారించాడు.

మర్నాడే సారథిని ట్రాన్స్ఫర్ చేయించటానికి ప్రయత్నాలు ప్రారం భించేడు. అయిదువందల రూపాయల ఖర్చుతో అది సాధ్యపడింది. ఆ వుద్యో గము మానేసెయ్యమని మంజుల సారథికి ఎంతగానో చెప్పింది. అయితే చేస్తూ చేస్తూ వున్న వుద్యోగాన్ని ఒదులు కోటానికి అత నిష్టపడలేదు. ఇప్పటి నించే మంజులనించి డబ్బు తీసుకోటం కూడా అతనికి ఇష్టంలేదు. తల్లినీ చెల్లెలినీ పోషించాల్సిన బాధ్యత తన మీద వున్నదని అతను మర్చిపోలేదు. అందుకనే మంజులకి రెండువొందల మైళ్ళదూరం వెళ్ళవలసి వొచ్చింది. వెంటవెంట ఉత్తరాలు రాస్తుంటాననీ, నెలా రెణ్ణెల్లకీ వొస్తాననీ మాట ఇచ్చా కనే మంజుల అతన్ని పోనిచ్చింది.

సరే, అతను వెళ్ళిపోయేడు.

దుర్గారారావ్ కి, వేరే పనిలేకపోవ టము మూలాన ఇరవై నాలుగ్గంటలూ మంజుల సమక్షంలోనే ఉండటం మొద లెట్టాడు. అతను తీసుకునే అతిచను వుని అసహ్యించుకున్నా, శ్రీమన్నారా యణని చూసి వూరుకుంటోంది మంజుల. సారథి వెళ్ళిపోయి నెలకావొ స్తున్నది. దుర్గారావ్ తనవెంట మంజు లని సినిమాలకీ షికార్లకీ తిప్పలేక పోయేడు. ముసలాయన పోయి ఆరేడు నెల లయింది. ఇంకో అయిదునెల్లు పోతేకాని మంజుల పెళ్ళి చేసుకోటానికి వీలుండదు. ఈ మధ్యన సారథి వొచ్చే ప్రమాదం వున్నా రెండు మూడు రోజులకన్న ఎక్కువ వుండడు కనకనే యీ వ్యవహారంలో తొందరపడలేదు దుర్గారావ్.

దుర్గారావు మహా మంచివాడనీ, అంత మంచివాళ్ళు లోకంలో చాలా అరుదనీ శ్రీమన్నారాయణ వీలు దొరికి నప్పుడల్లా మంజులకి చెబుతూ వొచ్చాడు. ఆ మాటని వెంటనే ఒప్పు కున్నా, దుర్గారావుతో ప్రేమసంభా షణలు వల్లించలేదు ఆమె. ఎప్పుడూ ఏదో చదువుతూనో, ఆలోచిస్తూనో వుండే మంజుల, వాళ్ళకి ఓ సమస్యగా తయారయింది.

ఆ పిల్ల తనతో చనువుగా వున్నా, లేకున్నా తన అవసరాలు తీరుతు న్నాయి కనక దుర్గారావు ఏమీ తొందర పడదల్చుకోలేదు. కాని అతని అవసరాల క్కావల్సిన డబ్బు సంపా దించటం శ్రీమన్నారాయణకి సులువనిపించటంలేదు. ఇలా కాలం గడుస్తూ పోతూంటే మళ్ళీ ఆ సారధి గాడు వొస్తాడు. మళ్ళీ కథ ఎప్పటి నడుస్తుంది.

బాగా ఆలోచించి మంజులతో ఈ విషయం తేల్చుకోక తప్పదని నిర్ణ యించుకున్నారు.

"ఈ దుర్గారావున్నాడు చూడమ్మా! డబ్బున్నవాడు; మంచివాడు. మన కంటె మంచిసంబంధాలు చాలా వొస్తున్నాయి. అతనేమో నీమీద మనసు పెట్టుకున్నాడు. నువు సరే నంటే తాంబూలా లిచ్చేసుకుందాం. అవకాశం చెయ్యి జారిపొయ్యాక అనుకుని ప్రయోజనం ఉండదు."

మంజులకి అత నేం చెప్పాడో ఓ పట్టాన అర్థంకాలేదు. అర్థం అయ్యాక "నా పెళ్ళి కిప్పు డేం తొందర మామయ్యగారూ!" అంది మామూలు యావరేజ్ ఆడపిల్లల్లాగే.

పెళ్ళిప్పుడే చేసుకోవటం లేదమ్మా! తాంబూలా లిచ్చుకుంటే, ఇంక నీ వ్యవహారాలన్నీ అతనే చూసుకుం టాడు. నాకూ ఓ ఇల్లూ వాకిలీ వుంది కదమ్మా!" అన్నాడు, ఆ విషయం అప్పుడే జ్ఞాపకం వొచ్చినట్టు.

మంజులకి నోరు విడిచి చెప్పకతప్ప లేదు. "అయితే సారథికి టెలిగ్రాం ఇప్పించండి మామయ్యగారూ! ఉద్యో గానికి రిజైన్ చేసి వొచ్చేయమనండి!" అంది తల వంచుకుని.

శ్రీమన్నారాయణ నిర్ఘాంత పొయ్యేడు. వ్యవహారం ఇలా బెడు స్తుందని అతను అనుకోలేదు. అయినా ఏమయింది? తెలివిగలవానికి ఉపా యాలే కరువా?

"తొందరేం లేదు. బాగా ఆలో చించుకోమ్మా. సారథిని గురించి నేను చెడ్డగా విన్నాను," అనేసి పోయేడు.

"ఆలోచించటానికేం లేదు మామయ్యగారూ!" అన్న మంజుల మ్మాటల్ని అతను కావాలనే విన్పించు కోలేదు. అలా వెళ్ళిన శ్రీమన్నారాయణ సాయంత్రాని కింటి కొచ్చేది. వొచ్చీ రాగానే మంజుల్ని పిలచి "నీ ఇష్టం అమ్మా! రేపు ప్రొద్దున సారధిని రమ్మని రాస్తాను. ఈ బరువు తొందరగా వొదిలించుకోవాలని నాకూ ఉంది," అన్నాడు.

మర్నాడు ప్రొద్దున ఓ పల్లెటూరి వ్యక్తి ఆ ఇంటికి వొచ్చేడు. తనని తాను సారధి మామగారిగా పరిచయం చేసుకొన్నాడు. "సారథి అడ్రసు కావాలమ్మా. ఆఫీసు కెడితే నిన్నడి గితే తెలుస్తుందని చెప్పా," రన్నాడు.

నమస్కారం చేసి, సారథి అడ్రసు ఓ కాగితంమీద రాసిఇచ్చింది మంజుల.

అది తీసుకుంటూ "దౌర్భాగ్యుడు' నాలుగేళ్ళ క్రితం అయిదువేల కట్నం తీసుకుని లక్షణంగా పెళ్ళి చేసుకున్నాడు. ఆ డబ్బెట్టి పెద్ద చదువులు చదివాడు. ఉద్యోగం దొరికి ఆరు నెల్లయినా పిల్లని తీసుకుపొయ్యేమాట తలపెట్టటం లేదు." అన్నా డతను.

"ఎవరండీ!" అనడిగాడు అప్పుడే అక్కడికి వచ్చిన శ్రీమన్నారాయణ, ఏమీ తెలియనట్లు.

"మా సారథి బాబూ!" అన్నాడా వ్యక్తి.

"ఏమంటున్నారు మీరు? సారథికి పెళ్ళయిందా?" మంజుల అడిగింది.

అవునమ్మా! నా కూతుర్నే చేసుకున్నాడు. వొస్తానమ్మా. అతన్నెలాగైనా వెదికి పట్టుకోవాలి," అంటూ వెళ్ళిపొయ్యా డతను

రెండు చేతులమధ్యన తలపెట్టుకుని కూర్చుండిపోయింది మంజుల

"నే న్చెప్పలేదా అమ్మా! వాడుట్టి దొంగవెధవ. డబ్బు కాజెయ్యాలని చేరేడు మన దగ్గర!" అన్నాడు శ్రీమన్నారాయణ.

భోరున ఏడ్చేసింది మంజుల. "నిజమా మామయ్యా! ఇదంతా నిజమేనా? నే న్నమ్మను; సారథి అలాంటివాడు కాదు. నే నేం చేశానని అతనికి ఇలా మోసం చేయడానికి."

మనలోని బరువుని తగ్గించే శక్తి ఏడుపుకి వుందని ఆయనకి తెలుసు. అందుకే ఆమెను కాసేపు ఏడవనిచ్చాడు.

"అలాంటి నీచునికోరకు బాధపట్టం ఎందుకమ్మా! అతన్ని మర్చిపో. మన దుర్గారావున్నాడు. నిన్ను నెత్తిన పెట్టుకొని పూజిస్తాడు," అన్నాడు కొంచెం నే పాగి.

"ఎలా మరిచిపోను మామయ్యా! ఎలా? ఎందు కిట్లా జరిగింది? నే నేం చెయ్యను?" అంది మంజుల ఏడుస్తూనే.

సారథిని రకరకాలుగా తిట్టేడాయన. అన్నెం పున్నెం తెలియని అమ్మాయిని మోసం చేసినందుకు నరకానికి పోతా డన్నాడు. మంజుల డబ్బుకోరకే అత నిలా చేశా డన్నాడు. ఏవో అన్నాడు. ఏవేవో చెప్పాడు.

మంజుల మాట్లాడ లేదు.

ఆయన బయటికి వచ్చేశాడు. ఇప్పుడు దుర్గారావ్ ని కలుసుకోవాలి. తను సాధించిన ఘనవిజయం గురించి చెప్పాలి ఇనుము ఎర్రగా వున్నప్పుడే సమ్మెట దెబ్బలు వెయ్యాలి. ఆమెని తమ కిష్టం వచ్చినట్లు మల్చుకోవటం ఈ క్షణంలోనే వీలవుతుంది.

అదే ఆలోచనతో ఆయన మెట్లు దిగుతుండగా పోస్ట్ మాన్ ఎదురు వచ్చాడు. మంజుల పేరిట వున్న ఆ కవర్ ని ఆయన చేతి కిచ్చేడు. అది సారథినించి వచ్చిన వుత్తరమని ఆయ



నకి తెలుసు. ఈ సమయంలో ఆ ఉత్త రాన్ని మంజుల మాట్టం ఏ మాత్రం మంచిది కాదనికూడా ఆయనకి తెలుసు జేబులో పెట్టేసుకని కారు ఎక్కేడు

ఆయన దుర్గారావ్ ఇంట చేరే సరికి అతను చాలా బిజీగా వున్నాడు. పిలిచినా విన్పించుకునే స్థితిలో లేడు. చుట్టూ ఓ పదిమంది కూర్చుని వున్నారు. దుర్గారావ్ నిన్న తనిచ్చిన వంద రూపాయలనోటుని చిల్లరగా మార్చేసి ఎదటివాళ్ళకి పంచిపెడుతున్నాడు. ఫెయిర్ - కలర్ - అంటున్నాడు.

ఆయనకి మండిపోయింది. సమయం కాదు కనక వూరుకుని మొదట వాళ్ళందర్నీ బయటికి వెళ్ళగొట్టేందుకు పూనుకొన్నాడు. అరగంట విశ్వప్రయత్నము చేసేక ఆయన్ని మనసులోనూ బయటికీ తిట్టుకుంటూ. దుర్గారావ్ ఎదట వున్న చివరి పది రూపాయల నోటుని అసంతృప్తిగా చూస్తూ వెళ్ళిపొయ్యారు వాళ్ళంతా.

జరిగిందంతా విని దుర్గారావ్ ఎగిరి గంతేశాడు. "నీ ఆట కట్టిందిరా సారథీ," అన్నాడు. "ఐడియా అంటే

నీదే గురూ!'' అని శ్రీమన్నారాయణని మెచ్చేసుకున్నాడు. ఇంకా ఏమనేవాడో కాని, శ్రీమన్నారాయణ అతన్ని వారించి మంజులని ఓదార్చటానికి పదమన్నాడు.

దుర్గారావ్ బట్టలు మార్చుకుంటున్న సమయంలో, శ్రీమన్నారాయణ, సారథి రాసిన ఉత్తరాన్ని ఎంజాయ్ చెయ్యటానికి పూనుకున్నాడు. లవ్ లెటర్ ఎలా వుంటుందో చదివి చాలారోజు లయింది. ఆ మధ్యనెప్పుడో వాళ్ళ పెద్దమ్మాయికి వొచ్చే వుత్తరాలు చదివాడు; కాని ఇల్లు విడిచి వచ్చి చాలారోజు లయిందికదా!

నా ప్రియమయిన మంజూ!

నీ వుత్తరం చదివి ఎంత సంతోషించానో చెప్పలేను. అంత మంచి వార్తవిని నేనింకా ఇక్కడేవుంటానా! సెలవు తీసుకుని రెండు మూడు రోజుల్లో వొస్తున్నాను. భయపడాల్సిన అవసరం లేదు పిచ్చితల్లీ!" నే న్నీవాడినే ఎప్పటికీ. నాలుగురోజుల్లో మనం ప్రపంచం ఒప్పుకునేదంపతుల మౌదాం.

అవునుగానీ, ఎవరు కావాలని వుందమ్మా నీకు? అమ్మాయా? అబ్బాయా? నాకుమాత్రం అచ్చం నీలా వుండే ఆడపిల్ల కావాలనివుంది. అమ్మాయి నివ్వకపోతే నీతో అసలు మాట్లాడనుకూడాను.

సరే, వీలయినంత త్వరలో వొస్తున్నాను.

నీ, సారథి

చేతులు వొణుకుతున్నాయి శ్రీమన్నారాణకి. గంటకిత్రం మంజులకి తను చెప్పినవన్నీ జ్ఞాపకం వొచ్చేయి. మంజుల దుఃఖమూ స్ఫురణ కొచ్చింది. ఇందుకా? ఇందుకేనా ఆమె అంత బాధపడిందీ!

చటుక్కున లేచి నుంచున్నాడు. అవును. ఈ వుత్తరం మంజులది. తాను పొరపాటున చదివేడు. ఆమెకి అంది వ్వక తప్పదు.

కాని ......

ఏదో గుర్తుకి వొచ్చినట్టు, ఎవరో వెనకనుంచి తోసినట్టు అతను పరుగెత్తుకుని వెళ్ళి, కారులో ఎక్కేడు. కాల్చి పారేసిన సిగరెట్ పీకలమధ్య దుర్గారావు వొంటరిగా కూర్చుని, చివరి పదిరూపాయల నోటువంక జాలిగా చూస్తున్నాడు.

ఇంటికి చేరిన శ్రీమన్నారాయణకి నిశ్శబ్దం భయంకరంగా తోచింది. మంజుల గదితలుపులు తెరుచుకుని లోపలికి వెళ్ళిన శ్రీమన్నారాయణకి – ఆమె పక్కమీద రెండేరెండు వాక్యాలు రాసిన మంజుల ఉత్తరం కన్పించింది; 'నేను సారథి దగ్గరకు వెళ్ళిపోతున్నాను. నాకోసం మీరు తీసుకున్న శ్రమకు ధన్యవాదాలు!'

"పిట్ట ఎగిరిపోయింది–" అని నిట్టూర్చాడు శ్రీమన్నారాయణ!

———



# పతి భక్తి

* ఊ. రాంరెడ్డి

హల్లో... యిన్‌స్పెక్టర్‌గారేనా?

"యస్."

"చూడండి... బహుశా మీరంత బిజీగా లేరనుకుంటాను.''

"యస్...''

"నేనిపుడు నా రూంలో కూర్చుని మీకు ఫోన్ చేస్తున్నాను... ఎదురుగా ఉన్న కిటికీ అద్దం పగిలిపోయిఉంది... అన్నట్టు మాకు పిల్ల లెవరూ లేరు... దాన్ని నేనాడో చిన్నప్పుడు పగులగొట్టి-నాను... అందులోనుండి బయటకుచూస్తే మా హాలులోని ప్రతిఅంగుళం కూడా కనిపిస్తుంది... హాలుపక్కనే వరండా ఓటుంది ... దాన్నిమధ్యనే కొత్తగా కట్టించాం! అన్నట్టు ఆవరండానే డ్రాయింగ్‌రూంగా కూడా వాడుకుంటాం ...వచ్చిన అతిథులు కూర్చోవడానికి నాలుగు కుర్చీలుకూడా వేసుంచాం!"

"ఇంతకీ అసలువిషయం ఏమిటి..."

"చెబుతున్నా యినస్పెక్టర్‌గారూ... యీవేళ ఆదివారం... యిపుడు సరిగా పన్నెండుగంటలు కావచ్చింది...మావారికీదినం ఆఫీసులేదు ... ఆఫీసు లేకపోతే యింట్లోనే ఉంటారని మీకు తెలుసు."

"అయితే .."

"అన్నట్టు మావారు బ్యాంకిలో పన్చేస్తారు ... యింత పెద్ద యింట్లో మే మిద్దరమే ఉంటాం! యీ లంకంత యింటిని మా నాన్నగారు పోతూ ... పోతూ నాకిచ్చి వెళ్ళిపోయారు -"

"ఓ...అమ్మా...అసలువిషయం..."

"ఉండండి! యింతకుముందే మావారు ఫోంచేసి వరండాలో కూర్చుని పేపరు చూసుకుంటున్నారు ... నేను పక్కలకని ప్రస్తుతం నేనున్న రూంలోకి వచ్చాను...అసలు విషయం...నేనున్న యీ రూము తలుపులు లోపల బిగించేశాను..."

"విషయం చెప్పవమ్మా!

"అలా విసుక్కోకండి! సరిగ్గా అర్ధ గంటముందు నలుగురుదొంగలు హాలులో నుండి వరండాలోకి పోయారు ..."

"ఏమయింది .. క్విక్..."

"నేను వారిని చూడగానే తలుపులు




బిగించుకున్నాను. హాలునుండి వాళ్ళు వరండాలోకి పోవడం స్పష్టంగా కనిపించింది – అన్నట్టు వాళ్ళందరి చేతుల్లో పిస్తోళ్ళున్నాయి..."

"అబ్బబ్బ ... వాళ్ళెవరో యీ రో త్వరగా చెప్పనివ్వమ్మా!"

"నన్ను చెప్పనివ్వండిమరి! డబ్బు ఎక్కడుందో మర్యాదగా చెప్పమని మావార్ని వాళ్ళు గట్టిగా బెదిరించడం నాకు స్పష్టంగా వినిపించింది..."

"అబ్బ బ్బ బ్బ ..."

"మావారుమాత్రం తక్కువవారా! నాకు తెలీదని అంటూనే ఉన్నారు ... యివ్వకపోతే వాళ్ళు కాల్చిపారేస్తామని కూడా అన్నారు..."

"అయ్యో ... త్వరగా అడ్రస్ చెప్పండి; క్విక్..."

"ఏమో నాకు భయంగా ఉంది యిన్‌స్పెక్టర్‌గారూ! యింతకూ పదినిమిషాల క్రితమే పిస్టల్ పేలిన ధ్వనికూడా వినిపించింది."

"భగవాన్!"

"మావారు బాధగా అరిచిన అరుపు కూడా వినిపించింది ... అన్నట్టు మా యింట్లో పదివేలవరకు క్యాష్ ఉంది ... నగలూ ... ఫర్నీచరూ ... హలో ... ఇన్‌స్పెక్టరుగారూ ... హలో ... హలో..."

# వ్యక్తిత్వం లేని మనిషి

## జరిగిన కథ

[మాలతి జగతిని చూడటానికి వచ్చినప్పుడు వాళ్ళిద్దరూ కలిసిమెలిసి మాట్లాడుకున్న తీరును చూచి మృత్యుంజయరావు ఆశ్చర్యం చెందాడు.

తన అక్కను తను అర్థం చేసుకోలేకపోవటం ఆతనికి ఒకవిధమైన వింతగా తోచింది. ఆమె రోజూ పడుకోబోయేముందు ఓ పుస్తకంలో ఏదో వ్రాస్తూవుండటం గమనించిన మృత్యుంజయరావు ఓరోజు ఆమె లేనిసమయంలో పెట్టెలోనించి ఆ పుస్తకం తీసి, ఆ వ్రాసింది చాలాభాగం చదివి విస్తుపోయాడు. సారాంశం— మృత్యుంజయరావుకు మొదట్లో పిశాచంలా అగుపించిన జగతి స్వాములవారి బోధనలూ, సహచర్యంతో ఊహించలేనంత మార్పు చెందినట్లుగా గోచరించింది.] — ఇక ముందుకు సాగండి.

## 10

ఈమధ్య మాలతిని తరచు కలుసుకోవటం సంభవిస్తోంది మృత్యుంజయరావుకు.

చాలాసార్లు మధ్యాహ్నం విరామ సమయంలో కాఫీకి ఆహ్వానిస్తోంది. కొన్నిసార్లు ఆమె ఇంటికి వెళ్ళటం తటస్థించింది.

పసుపతిగారూ, ఆయన భార్యా, ఓగతా కూతుళ్ళూకూడా ఎంతో చొరవగా మాట్లాడతారు. మాలతికి ఇద్దరు చెల్లెళ్ళు. పెద్దచెల్లెలు స్కూల్ఫైనల్ చదువుతోంది. చిన్నచెల్లెలు థర్డుఫారం చదువుతున్నది. అక్కా చెల్లెళ్ళు చాలా ఆప్యాయంగా, ఒకరిమీద ఒకరు విసుర్లు విసురుకుంటూ ఉల్లాసంగా కాలం గడుపుతారు.

"మీ ఆఫీసువాళ్ళంతా కలిసి మా అమ్మాయికి ఉపకారం చేశారా, అపకారం చేశారా చెప్పండి." అనడిగారు ఒకసారి పశుపతిగారు, కళ్ళజోడు సవరించుకుంటూ.

ఉపోద్ఘాతంలాంటి యీ ప్రశ్న విని మృత్యుంజయరావు చకితుడై చూశాడు.

"మీరంతా కలిసి మా యింటిమీద దండయాత్ర చేసి మా అమ్మాయిని నాటకంలో వెయ్యటానికి ఒప్పించారు. అది నటించింది. దానికా పెళ్ళీడు వచ్చింది. కూతురు పెళ్ళిచెయ్యాల్సిన బాధ్యతతో పెద్దవాళ్ళం నానాయాతనా పడుతున్నాం. ఈ మధ్య ఒక పెళ్ళి సంబంధం చూశాం. కుర్రాడు యింజనీరింగ్ ప్యాసయ్యాడు. వేషం చూసి అభిరుచులు కలవాడనుకున్నాం. తీరా పెళ్ళిచూపుల్లో ఏమని

అడిగాడో తెలుసా ? 'మీ అమ్మాయి నాటకాల్లో వేషాలు వేస్తుందిట కదండీ !' అన్నాడు. 'దానిది కళా హృదయం,' అన్నాను. 'నాది కాదులేండి,' అన్నాడు. మళ్ళీ ఐపు లేడు," అన్నారు పశుపతిగారు.

అసలు మృత్యుంజయరావుకు మాలతి ఆ నటించటం ఇష్టంలేదు. కారణం ఆతనికే తెలియదు. కాని ఆమెను శాసించే అధికారం అతని కేముంది ? ఆ విషయమే ఆయనకు చెబుదా మనుకున్నాడు. కాని చెబితే, 'అయితే ఎందుకు మీరంతా కలసి మా అమ్మాయిని రచ్చ కెక్కించారు ?' అని ఆయన కోపంగా అరుస్తాడనుకుని మెదలకుండా వూరుకున్నాడు.

అట్లా అని ఆయన మాటమీద మళ్ళీ ఆయనే నిలబడివుండలేదు. ఆడపిల్లలు సోషల్‌గా వుండవలసిన అవసరం గురించీ, తను పెంపకంలో యిచ్చిన స్వేచ్ఛను గురించీ మళ్ళీ లెక్చర్లు దంచుతాడు.

కాని మాలతి పెళ్ళివిషయం తలిదండ్రుల్ని విశేషంగా కలవరపరుస్తున్నట్టే వుంది. ఒకసారి మాలతి తల్లి సత్యవతమ్మగారు, "అమ్మాయికి ఎక్కడన్నా సంబంధా లుంటే చెప్పు నాయనా ! ఆయన చూస్తే అహో పరస. ఒకరోజు పట్టించుకున్నట్లు కనిపిస్తారు. మళ్ళీ నెలల తరబడీ ఆ ప్రమేయం ఎత్తరు. నాకు వంట్లో ఎప్పుడూ ఆరోగ్యంగా వుండదు. మన కులంవా డయితే చాలు, శాఖ ఏదయినా పరవా లేదు. దానికి పెళ్ళి కాదేమో నన్న దిగులుతో చచ్చిపోతున్నాను," అని మొరపెట్టుకుంది. ఆవిడకి ఇంచుమించు కళ్ళనీళ్ళ పర్యంత మయింది.

'చెట్టంత బ్రహ్మచారిని ఎదురుగా నే నుంటే — యీవిడకి కళ్ళు కనబడటం లేదా ?' అనుకున్నాడు మృత్యుంజయరావు. కాని మరుక్షణంలో తన ఆలోచనకు అతడే లజ్జితుడయాడు. 'కాకి ముక్కుకు దొండపండులా నే నేమిటి మాలతికి ?' అనుకున్నాడు.

"ఆలాగే నండీ," అన్నాడు బుద్ధిమంతుడిలా ముఖం పెట్టి.

ఒక సాయంత్రం పశుపతిగారి యింట్లో మాలతీ, మృత్యుంజయరావూ దగ్గర దగ్గరగా కుర్చీలలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. అంతకుముందే మాలతి వేడివేడి టీ ఇచ్చింది. పశుపతిగారు ఇంట్లో లేరు మిగతా కూతుళ్ళు సినిమాకి వెళ్ళారు. సత్యవతమ్మగారు వంటింట్లో పని చేసుకుంటోంది.

"నా పెళ్ళి యింట్లో పెద్ద సమస్య అయిపోయింది," అంది మాలతి బలవంతాన నవ్వి. రేడియోమీద వేలుపెట్టి రాస్తోంది మృదువుగా.

''మీరు ఎడ్యుకేటెడ్ గరల్ కదా! మీకూ యిది సమస్యగా తయారయిందా?" అనడిగాడు అతను.

"ఎడ్యుకేటెడ్ గరల్ మాత్రం మనిషి కాదా? ఆమెకు సమస్య ఉండవా?"

"అదికాదు. ఈ సమస్యను స్వయంగా పరిష్కరించుకోలేరా?"

''అది కబుర్లలో అనుకున్నంత తేలికకాదండీ! ప్రేమించాలని ఒకరిని ప్రేమించలేం. కాని పెళ్ళికోసం ఎర్ర వేయవలసిన దుర్గతి పట్టింది చదువుకున్న అమ్మాయికి," అంది మాలతి ఆవేదన ధ్వనిస్తూన్న కంఠంతో.

అత నాశ్చర్యంగా చూస్తున్నాడు.

" 'మాకు పెళ్ళి వద్దు. మేం చేసుకోం,' అంటారు చదువుకుంటూన్న ఆడపిల్లలు ఎంతమంది మనఃపూర్వకంగా అంటారో, ఎంతమంది డిగ్నిటీకోసం అంటారో చెప్పటం కష్టం. తలిదండ్రులు కూడా 'మా పిల్లముందు పెళ్ళిమాట ఎత్తకండి' అంటారు గొప్పగా. చదువు పూర్తి అయిపోతుంది. ఉద్యోగాలో, ఏదో మొదలుపెడతారు. రోజులు గడిచి ఏళ్ళు పైబడుతూ వుంటాయి. ఇహ భుజాలు తడుముకుంటూ వరాన్వేషణకు మొదలుపెడతారు తలిదండ్రులు. ఇంత చదువు చదివినా కట్నాల బెడద తప్పదు. పైగా చదువు పూర్తి చేసినవారూ, సంపాదించుకుంటున్నవారూ కావాలి. పిల్లకు పాతికేళ్ళు పైబడుతూంటాయేమో, ఏ ముప్ఫయి ఏళ్ళవాడ న్నా దొరకాలి. ఎంతకాలానికీ పెళ్ళిగాక 'పెళ్ళో, పెళ్ళో' అని కలవరించి, బాధ దాచుకోలేక అనేక విధాల బయటపడిపోయిన స్త్రీలను చాలామందిని చూశాను. సమవృజ్ఞ దొరక్క, తనకంటే అనేకరెట్లు చదువులోనూ, స్థానంలోనూ కూడా తక్కువదశలో వున్నవారిని, ప్రాణం విసిగి చేసుకున్న స్త్రీలను చూశాను. ఎంతకీ పెళ్ళి గాక జీవితాంతం అవివాహితలుగా మిగిలిపోతూ, కుమిలిపోతూన్న వాళ్ళని చూశాను. పెళ్ళి వద్దని సంవత్సరాల తరబడి కబుర్లు చెప్పి, మూడుముళ్ళూ పడిన మరుక్షణంనుంచీ మొగుడ్ని విడవకుండా అంటిపెట్టుకుని, లోకాన్ని మరిచిపోయిన వాళ్ళని చూశాను."

మాలతి ఆగింది. ఆమెలో ఎంత ఆవేదన గూడుకట్టుకుని వుందో ననిపించింది అతనికి.

ఒక ప్రశ్న అడగా లనుకున్నాడు. కాని ఆమె ఏమయినా అనుకుంటుందేమో నని భయపడ్డాడు. ఎలాగో ధైర్యం తెచ్చుకుని నసుగుతూ అన్నాడు: "ఒక ప్రశ్న అడిగేదీ?"

"అడగండి," అంది మాలతి తేలిగ్గా.

"మీకూ పెళ్ళి చేసుకోవాలని వుందా ?"

సిగ్గుతో ఆమె కపోలాలు ఎర్రబారాయి. లేత చిగుళ్ళను వ్యక్తంచేస్తూ ఆమె పెదిమలు విప్పారినై. "ఉండదా మరి ? అందరిలాంటి ఆడపిల్లను కానా ?"

ఈ సమాధానం విని అతడు పులకితు డయాడు. ఒక క్షణం ఆగి – "ఎవరినైనా ప్రేమించారా ?" అని అడిగాడు, ధైర్యం ఎక్కువ చేసుకుంటూ.

"అలాంటి దేమీ లేదనుకుంటాను," అన్నది మాలతి లేతగా నవ్వి.

అతని కీవేళ ఎక్కడలేని సాహసమూ కలుగుతోంది "ఎవరినైనా ప్రత్యేకంగా పెళ్ళి చేసుకోవాలని సంకల్పం వున్నదా ?"

"ఇంతవరకూ లేదు."

"ప్రేమించకుండా పెళ్ళాడటానికి ఏమైనా అభ్యంతరా లున్నాయా మీకు ?"

"అవీ లేవు !

"ఎలాంటి వ్యక్తిని పెళ్ళి చేసుకోవాలని మీ ఆశయం ?"

"అంటే ?"

"అతను అందగాడై వుండాలా ?" ఈ ప్రశ్న అడుగుతూంటే కంఠం చలించింది.

"నా మనసుకు నచ్చాలికదా !"

"ఉద్యోగం, కులం, స్టేటస్..."

"పెద్ద కోరికలు లేవు."

'నన్ను చేసుకుంటారా ?' ఈ ప్రశ్న అతను అడగలేదు. అతడి సాహసం అక్కడితో ఆగిపోయింది.

ఆ రాత్రి యింటికి తిరిగివస్తూ అత నాలోచించాడు. "ఛీ ఛీ ! నేను సంభాషణ సరిగ్గా జరపలేదు. ఎప్పుడూ యిలాంటి ప్రమేయం వచ్చినప్పుడు ఎదుటివారి అభిప్రాయాన్ని గుచ్చి గుచ్చి అడక్కూడదు. మనం తప్ప అక్కడ యింకో వ్యక్తి వైపుగాని, వివరం వైపుగాని, దృష్టి మరల్చనీయకూడదు. ఆమె అభిప్రాయాలకు అంత విలువ యిచ్చినప్పుడు, మనం కేవలం ప్రేక్షకుడుగానో, శ్రోతగానో నిలబడి చోద్యం చూడవలసివస్తుంది. ఛీ ఛీ ! నాకు మాట్లాడటం చేతకాదు.

* * * *

మాలతి, మృత్యుంజయరావుతో ఎక్కువసేపు సంభాషిస్తూ వుండటంతో అతన్ని కథానాయకుడ్ని చేసేసింది ఆఫీసులో. అందరికీ వంటిమీద చీమలు పాకుతున్నట్లు వుంది. ఆఫీసరుకూడా గుర్రుగా చూస్తున్నాడు. ఏదో మిషమీద అతన్ని గదిలోకి పిలిపించి తిడుతున్నాడు.

సాయంత్రాలు కళాసమితి మందిరంలో అతడ్ని గురించి వదంతులు పేలిపో తున్నాయి.

"వీ డెట్లా వరించిందయ్యా ఆ మాలతి? ఆ అమ్మా యింత టేస్ట్‌లెస్ ఫెలో అనుకోలేదు."

''ఇంటికి రోజూ వెడుతున్నాట్ట!"

"వీడు వొట్టి చవటనుకున్నాం. అబ్బో, గ్రంధసాంగుడే!''

"అసలు ఎంత సేపూ హస్కేనా? ఏమయినా ... జరిగిందా అని?"

"ఊరుకోవయ్యా! ఇంతవరకూ వచ్చింతర్వాత వా దూరుకుంటా దేమిటి? ఏం? అంత మగతం లేనివా డనుకుంటున్నావా?''

''అయినా అసలు ఎట్లా పట్టాడయ్యా మనం యింతమంది వుండగా?"

"వాడి ముక్కువొంకర దానికి కనిపించలేదా?''

"అసలు వీళ్ళిద్దరికీ ఎక్కడ వీలవుతుందా అని?"

"ఎక్కడేమిటి? 'వ్హేర్ దేర్ యీజ్ ఎ విల్, దేర్ యీజ్ ఎ వే' అన్నారు. ఆవి డింట్లోనే సాధ్యపడుతుంది, ఎక్కడా చోటు లేకపోతే?"

"ఇంట్లోనా? తండ్రి లేడూ?"

"ఆయన కిలాంటి అభ్యంతరాలు లేవటలే. కూతురు సంపాదిస్తే బతుకుతున్నాడు. వా డో మనిషా?''

"ఆహా! అలానా? పెద్దమనిషి అనుకున్నాం సుమా."

"అసలు ఆయనే కూతుళ్ళని వొప్పచెబుతాడనికూడా యీ మధ్య తెలిసింది. ఆరా తీస్తున్నాను."

"మొత్తంమీద మనవాడి పంట పండింది."

"దబ్బిస్తున్నాడేమో.''

"ఈ నీళ్ళచెంబుమొహంగాడు ఎంతవా డయ్యాడూ?"

"వీడు ముద్దుకుంటూన్నప్పుడు – అంత దగ్గరగా – అబ్బ! ఎలా భరిస్తుందర్రా ఆ అమ్మాయి."

"అది సరే; ముద్దు రెసిప్రొకేట్ చేసినపుడు వీడి ముఖాన వున్న చిల్లులు గుచ్చుకోవటం లేదా అని?"

"కాని వాడి దగ్గర టిప్స్ నేర్చుకోవాలయ్యా."

"వాడి మొహం. వాడి దగ్గిర టిప్స్ ఏమిటి? ఏదో లక్కీగా పట్టేశాడు.''

ఇలా చెరిగేస్తున్నారు.

ఒకసారి సోమయాజులు అతని దగ్గరకు వచ్చాడు. "ఇదిగో అబ్బాయి - కుర్రా ఒవి. ఆఫీసులో శ్రద్ధతో పనిచేస్తున్నావు. టెస్టులు ప్యాస్ అవుతున్నావు. వృద్ధి లోకి గావల్సినవాడివి. నువ్వింకా ఎంతో బుద్ధిమంతుడి వనుకున్నాను. ఇలాంటి వెధవ్వేషాలు వెయ్యటం నా కేం నచ్చలేదు. ఆ మాలతి చాలా అమాయకురాలు; పెళ్ళికాని పిల్ల. ఆ పిల్లను యీలా పాడుచేయటం తప్పు. కూడని పని. ఆఫీసరు గారుకూడా పసిగడ్తున్నారు-దెబ్బతింటావు. ఇహనైనా యీ పాడుపన్లు మానెయ్యి. నీ శ్రేయోభిలాషిని కాబట్టి నీ హితవు గోరి చెబుతున్నాను," అని ఏకబిగిని లెక్చరిచ్చాడు.

తనగురించి నలుగురూ యిలా అనుకుంటున్నందుకు, అసూయపడి అలజడి లేవదీస్తున్నందుకు మృత్యుంజయరావుకు చాలా ఆనందం కలిగింది. 'ఇంతమంది నన్ను చూసి కుమిలిపోతున్నారు,' అనుకుంటూ ఉప్పొంగిపోయాడు. 'ఎంత అల జడి సృష్టించావురా జయా!' అని తనని తా అభినందించుకున్నాడు.

సోమయాజులుతో అవుననీ కాదనీ ఏమీ చెప్పక, అమాయకుడిలాగా ముఖంపెట్టి చూస్తూ వూరుకున్నాడు.

సోమయాజులు అంతటితో వూరుకోకుండా మాలతి వంటరిగా కూర్చునివున్న సమయం కనిపెట్టి ఆమె దగ్గరకు వెళ్ళాడు. కాసేపు ఆ కబురూ యీ కబురూ చెప్పి మెల్లిగా అసలు విషయంలోకి వచ్చాడు. "ఆ మృత్యుంజయరావు ఆడపాదడపా నీ దగ్గరకు వస్తున్నట్లున్నాడు. అతన్తో జాగ్రత్తగా వుండాలమ్మా."

ఆమెను అమ్మా అని సంబోధించటం అతనికి యిష్టంలేదు కాని పెద్దవాడు కాబట్టి అలా పిలవకపోతే బాగుండదని అతనికి తెలుసు.

మాలతి కనుబొమలు ముడివేసి ఏమిటన్నట్లు చూసింది.

"అతను చాలా గ్రంధసాంగుడు. బయటకు అట్లా ముచ్చలాగా కనిపిస్తాడు. అతనికి చాలామంది ఆడవాళ్ళతో సంబంధా లున్నాయి. ఒకసారి పర్వంలో ఎవరో అమ్మాయి రాత్రిసమయంలో యితను వుంటూన్న యింటివాళ్ళకోసం వచ్చిందట. వాళ్లు ఊళ్ళో లేరు. అదే అదననుకుని ఆ పిల్లను మాయమాటలతో వంచించి, లోబర్చుకున్నాట్ట. ఇలాంటివి చాలా ఉదంతాలు తెలుసు అతన్నిగురించి. నీ మేలు కోరి చెబుతున్నా."

"థాంక్స్ అండీ. జాగ్రత్తగా వుంటాను," అంది మాలతి. ఆమె కంఠంలో గాంభీర్యమూ లేదు, ఎగతాళీ కనబడలేదు.

"అస లివన్నీ నా కనవసరమనుకో. అయినా నీమేలు కోరినవాడ్ని. పెద్దవాడ్ని..." అంటూ లేచాడు.

ఒకరోజు తురంగరావు. మృత్యుంజవరావును వంటరిగా రోడ్డుమీద పట్టుకున్నాడు. "స్టేషన్‌లో కొంచెం పనివుంది. అలా వెళ్ళివద్దాం రావోయి." అని లాక్కుపోయాడు.

"మంచి ఛాన్సే కొట్టేశావులే" అన్నాడు దారిలో కన్నుగీటుతూ.

మృత్యుంజయరావుకు వెంటనే అర్ధమయింది. కాని అందరూ అనుకునేటంతటి అమాయకుడుగాక – వొట్టి అర్భకుడే అయివుండాలి. "ఏమిటి" అనడిగాడు ఏమీ తెలియనట్లు.

"అదేనోయి; మాలతిని పట్టేశావుగా."

మృత్యుంజయరావు గుంభనగా నవ్వి వూరుకున్నాడు. ఇంతలో ఎదురుగుండా ఎవరో అమ్మాయిలు కనిపించారు; కాలేజీ విద్యార్ధినుల్లా వున్నారు. తనలో ఏదో లోపం పసిగట్టి నవ్వుతారు. తురంగరావు చూడకుండావుంటే బాగుండును.

"ఏమోయి మాట్లాడవేం?"

"ఏం మాట్లాడను?"

"మీ యిద్దరిమధ్యా ఏమయినా జరిగిందా?"

అమ్మాయిలు వాళ్ళని దాటి వెళ్ళిపోయారు. వారివంక చూడలేదు. 'హమ్మయ్య' అని నిట్టూర్చాడు.

"ఛ ఛ, లేదోయి." అన్నాడు. అతనికి బొత్తిగా అబద్ధం చెప్పటానికి భయం వేసింది.

"మరి ఎంతవరకూ వచ్చింది?"

అతనికి చాలా యిబ్బందిగా వుంది. పూర్తిగా నిజం చెప్పినా తంటాయే. వాళ్ళు అసూయపడే అంశం లేకపోయేసరికి తనని గడ్డిపోచక్రింద కట్టేస్తారు.

"ఏదో కొంచెం కొంచెం," అని నసిగాడు.

"మాట్లాడుతున్నప్పుడు ఆమెచేతిని నీచేతిలోకి తీసుకుంటూవుంటావా?"

"ఊఁ..."

"ఇంకేం చేశావు?"

"అబ్బ! యింకేం చెయ్యలేదోయి"

"కొయ్యకు. ముద్దుపెట్టుకున్నావా?"

మృత్యుంజయరావు జవాబు చెప్పలేదు. అతని ముఖమంతా ఎర్రగా కందగడ్డలా అయిపోయింది.

"అదిగో ; నీ వాలకమే చెబుతోందిలే. ఏం ? నిజమే నంటావా ?"

మెల్లిగా తల వూపాడు.

"ఎప్పుడన్నా దగ్గరకు తీసుకున్నావా ?"

"ఉహుఁ!"

"పర్వాలేదు. అహఁ చెప్పు. నీ చేతులు ఆమె వీపుచుట్టూ వేసి దగ్గరకు లాక్కున్నావు. ఏం ?"

అతను మాట్లాడలేకపోయాడు. నానాయాతనా పడుతున్నాడు.

"నువు దాచలేవోయి. నాకు తెలుసు. నీ గుండెలకు అదుముకున్నావు. అవునా?"

'ఏం చెప్పను ?' అన్నట్లు చూశాడు మృత్యుంజయరావు.

"అఁ అదీ ; సరేగాని ఒకమాట అడుగుతాను. ఇంత వ్యవహారం నడిపినవాడివి ఆకాస్తా కానియ్యకుండా వూరుకుంటావా ? నన్ను బుకాయించవోలేయి. అవలిస్తే పేగులు లెక్కపెడతాను. ఊఁ, అను."

"ఊఁ."

తురంగరావు విజేతలా అట్టహాసం చేశాడు. "మరి ఏమీ లేదంటావా? కొలాంత కుడివోయి నువ్వు. చల్ల చల్లగా వుండి వ్యవహారం చక్కబెడుతున్నావు." అని భుజంమీద గట్టిగా కొట్టాడు.

* * * *

ఒక ఆదివారం ఉదయం మృత్యుంజయరావు క్షవరం చేయించుకుందామని బార్బర్‌షాపుకు వెళ్ళాడు. అక్కడ ఒక కుర్చీలో శేఖరం క్రాప్ చేయించుకుంటూ కనిపించాడు. ఇతనిని చూసి విష్ చేశాడు.

మృత్యుంజయరావు ఖాళీగా వున్న ఓ కుర్చీలో చదికిలబడ్డాడు. వెనకనుండి ఓ పనివాడు వచ్చి "క్రాపా? షేవింగా సార్?" అన్నాడు.

"క్రాప్" అన్నాడు. "షేవింగ్ యింట్లో చేసుకుంటాను."

ఆపనివాడు కొత్తగా చేరినట్లున్నాడు. అలవాటైనవాడు కాదు. తెల్లని గుడ్డ తెచ్చి క్రిందనుండి అతడి కంఠంవరకూ కప్పుతూ "ఎలా చెయ్యమన్నారు సార్? పొడుగ్గా వుంచమన్నారా? పొట్టిగా కత్తిరించమన్నారా?" ప్రక్కలన బాగా తగ్గించమన్నారా? ఒత్తుగా వుంచమన్నారా ? అని చిక్కుప్రశ్నలు వేశాడు.

ఇలాంటి సందర్భాలంటే అతనికి చెడ్డభయం. తన జుట్టునుగురించి, దాని

ఆకారాలను గురించీ అతనికి ఓ నిర్ధారణలేదు. మౌనంగా మంగలాడికి తల వప్పచెప్పి వూరుకుంటా డంతే. వా డెట్లా చెక్కి-వదిలిపెట్టినా వాడిష్టం. అత నెప్పుడు 'హెయిర్ కట్' చేయించుకున్నా బయటకు రాగానే "ఎవడ్రా నీకు చేసింది?" అని ఆక్షేపించని వాళ్ళు అరుదు. అందుకని యీబాధ పడలేక ఒకేషాపుకు వెళ్ళటం మొదలుపెట్టాడు. గుడ్డిలో మెల్లగా ఆషాపువాడికి అతని తలపద్ధతి కొంత అర్థమయింది. అతన్ని ప్రశ్న వేసి వేధించకుండా తమపని తాము చేసుకుపోసాగారు. కాని యివాళ యిత నెవరో కొత్తకుర్రాడు; తనని సతాయిస్తున్నాడు. ఇంకో పరిచితమైన పనివాణ్ణి పిలవమని చెప్పటానికి మొహమాటపడి, "అదే : అంతపొడుగూ పొట్టీ కాకుండా చెయ్యి. ప్రక్కలనే ఒకమాదిరిగా వుంచు," అని అద్దంలోకి చూసుకుంటూ కూర్చున్నాడు.

కొంతమంది దబాయించి చేయించుకుంటారు. "ఇదిగో : సైడ్స్‌న ఏమాత్రం ఎక్కువ తీసినా నాకు బాగుండదు. చెబుతున్నా. వెనకాల షేప్‌మాత్రం పోకూడదు తెలిసిందా ?" అని హెచ్చరికలు చేస్తారు. అలాంటి వ్యక్తుల్ని చూస్తే మృత్యుం జయరావుకు చాలాగౌరవం.

టైలర్ దగ్గరకు వెళ్ళినా అంతే. అందరూ కొలతలు అలా యిచ్చి, యిలా యిచ్చి దర్జీవాడికి తొంభయి నిబంధనలు చెప్పి, వాడు కుట్టాక అది ధరించి అద్దం ముందు అటుతిరిగి యిటుతిరిగి, ముందు చూసుకుని, వెనక చూసుకుని, 'యిక్కడ టైట్‌గా వుంది', 'యిక్కడ లూజ్‌గావుంది' అని వాడి దుంపతెంపి మళ్ళీ కుట్టించి - యింత హడావుడిచేస్తారు. మృత్యుంజయరావు అదేంలేదు. గుడ్డ వాడిచేతిలో పెట్టటం, శవంలా నిల్చోటం, 'మీ స్ట్రిక్చర్‌లో లోపం వుంది సార్' అని టైలర్ అనకుండా వుంటే అదే పదివేలు.

క్షవరం చేయించుకుంటూ శేఖరంవంక ఓరగా చూశాడు. సిగిరెట్టు కాల్చుకుంటూ దర్జాగా కూర్చునివున్నాడు. అలా సిగిరెట్టు కాల్చటంలో, అలా కూర్చోటంలో ఓ ప్రత్యేకత కనిపించింది మృత్యుంజయరావుకు. 'ఎలాగైనా అతను వేరు' అను కున్నాడు. అందుకే మంజులత అతనంటే మోజుపడింది. 'సరి సరి ; నా జీవిత మంతా ఇతరుల్ని అభినందించటంతోనే సరిపోతోంది' అని విసుక్కున్నాడు అతను.

మంజులత కోరికనుగురించి యింతవరకూ శేఖరానికి తెలియనివ్వలేదు తను. తన దాపరికానికి గర్వపడ్డాడు.

శేఖరం పని పూర్తయిపోయింది. షాపువాడికి డబ్బు లిచ్చేసి మృత్యుంజయరావు

# ప్రయాసలేని ప్రయాణం

*ప్రియమిత్రమా,*

యు-ఫోమ్ అనేక ముఖ్య పరిశ్రమలకు ఉపయోగపడుతున్నదని తెలుసుకొని మీరు కుతూహల పడగలరు.
ఉదాహరణకు, రవాణా పరిశ్రమయందు విమానాలు, రైళ్ళు, బస్సులలో, యు-ఫోమ్ అమర్చబడిన సీట్లు
ప్రయాణికులకు అధిక సౌకర్యముగ ఉన్నట్లు కనుగొనబడినది.

ఈ అంతర్జాతీయ యాత్రిక సంవత్సరంలో 200,000 పైబడిన యాత్రికులు భారతదేశాన్ని సందర్శించగలరని
ఎంచబడుతున్నది. వీరికి ప్రాథమిక సౌకర్యాలను సమకూర్చటం అతి ముఖ్యం.
విదేశీ మారకద్రవ్యాన్ని సంపాదించిపెట్టే ఈ ముఖ్య పరిశ్రమను పెంపొందించటంలో
యు-ఫోమ్ నిశ్చయంగా ఒక గొప్ప పాత్ర వహించగలదు.

*ఎప్పటికీ మీదైన,*

# యు-ఫోమ్

అద్భుతమైన బహుళోపయోగపు యురిథేన్ ఫోమ్

**U-FOAM**

యు-ఫోమ్ ప్రైవేట్ లిమిటెడ్
సనత్ నగర్, హైదరాబాదు-18







సోల్ సెల్లింగ్ ఏజంట్సు :
**ఎస్సోసియేటెడ్ సేల్సు అండ్ ఎడ్వర్టయిజింగ్ కం. 126, సరోజనీదేవి రోడ్డు, సికింద్రాబాద్-3 (ఆం. ప్ర.)**

FDSUF 885 TEA

డిస్ట్రిబ్యూటర్స్: ఇండస్ట్రియల్ సర్వీసెస్ కంబైన్స్, 125, మహాత్మాగాంధీ రోడ్; సికిందరాబాద్ - 3 (ఎ. పి) ఫోన్ : 75312.

భుజంమీద మెల్లిగా తట్టి, "నీతో కాస్త మాట్లాడాలి; బయట వెయిట్ చేస్తూ వుంటాను," అని వెళ్ళిపోయాడు.

అతనికి కంగారు పుట్టింది. ఏం మాట్లాడతాడు శేఖరం తనతో? ఎవర్ని గురించి?

కొంతసేపటికి పనివాడు తన కార్యక్రమం ముగించి, దువ్వెన్న అందించి "దువ్వుకొని చూసుకొండి సార్," అన్నాడు.

తను దువ్వుకునే పద్ధతి చూసి అతను నవ్వుతాడని "అబ్బ! నువ్వే దువ్వెయ్యవోయి పర్వాలేదు," అన్నాడు.

అతను ఓపిగ్గా అతని జుట్టు అటు దువ్వి, యిటు దువ్వి, ఓ ఆకారం తయారు చేసి, "ఇప్పుడు చూసుకోండి సార్! అద్దంలో. ఎంత ఫస్టుగా వుందో! రోజూ యిలా దువ్వుకుంటూ వుండండి," అన్నాడు సలహా యిస్తూ.

మృత్యుంజయరావు 'బాగుంది' అని మెచ్చుకుని, లేచి నిలబడి, బట్టలు దులుపుకుని, వాడికి డబ్బు లిచ్చి బయటపడ్డాడు.

కిల్లీకొట్టుదగ్గర శేఖరం సిగరెట్టు కాల్చుకుంటూ నిలబడ్డాడు. ఇతను దగ్గరకు రాగానే ఓ సారి క్రాఫింగ్ వంక ఎగాదిగా చూశాడు. ఏమయినా వ్యాఖ్యానం చేస్తాడేమోనని భయం వేసింది మృత్యుంజయరావుకు.

---

"పద!" అన్నాడు శేఖరం కదుల్తూ గంభీరంగా.

ఇద్దరూ నడవసాగారు.

శేఖరం ఏమీ మాట్లాడటం లేదు. మౌనంగా నడుస్తున్నాడు. ఏమీ చెప్పడేం? ఏమిటి మాట్లాడతా నన్నాడు?

అడుగుదా మనుకున్నాడు; కాని భయంవేసింది. ఊరుకున్నాడు.

చివరకు శేఖరం అన్నాడు: "మాలతితో తిరగటం మానెయ్యి."

అతని కంఠంలో గంభీరత్వం విని అతను చలించాడు. 'ఏం?' అని అడగటానిక్కూడా వెరిచాడు.

"మాలతిమీద నాకు ఉద్దేశం వుంది. తెలిసిందా?" అన్నాడు శేఖరం తిరిగి కఠినంగా.

మృత్యుంజయరావు అతని ముఖంలోకి చూసి భయపడిపోయాడు. తంతాడేమో ననిపించింది. ఏం మాట్లాడటానికీ ధైర్యం చాలక ఊరుకున్నాడు, అంతే. శేఖరం యింకేమీ మాట్లాడలేదు. సందు చివరకు వచ్చాక "అర్థమయింది కదూ!" అంటూ గబగబా నడిచి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయిన అయిదు నిమిషాలకుగానీ, అతను దిగ్భ్రమనుంచి తేరుకోలేదు. తర్వాత, "ఇదేమిటీ? బోడి శేఖరానికి ఎందు కిలా భయపడిపోయాను? వాడు నన్ను తన్నట మేమిటి? తంతే మళ్ళీ తంతాను. నేను మాత్రం తక్కువ తిన్నానా? నాకు కోపం వస్తే నేను తన్నగలను," అనుకున్నాడు.

శేఖరం ఎదురుగా వుండగా యీ విధంగా ఎందుకు ఆలోచించుకోలేకపోయాడో అర్థం కాలేదు.

ఏది ఏమైనా శేఖరంలాంటివాడిని అసూయతో కుమిలిపోయేటట్లు చేశాను అని మురిసిపోయాడు.

*   *   *   *

'నేను వీరుడిగా వుంటాను,' అని నిశ్చయించుకున్నాడు మృత్యుంజయరావు. అట్లా నిశ్చయించుకుని మాలతితో సన్నిహితత్వం కొనసాగించటానికే నిర్ణయించుకుని, యీ సంఘటన జరిగిన మరునాడే మాలతిఇంటికి వెళ్ళాడు. మెట్లు ఎక్కి లోపలకు పోతుంటే, గదిలో మాలతితో మాట్లాడుతూ తురంగరావు కనిపించాడు. మృత్యుంజయరావుని చూసి తురంగరావూ, తురంగరావుని చూసి మృత్యుంజయరావూ గాభరా పడ్డారు. మాలతి లేచి నిల్చుని "రండి," అని ఆహ్వానించింది ఆదరపూర్వకంగా.

ఇద్దరూ ఒకరివంక ఒకరు భావయుక్తంగా కాసేపూ, భావశూన్యంగా కాసేపూ చూసుకుని మెదలకుండా కూర్చున్నారు.

"తురంగరావుగారు యీమధ్య మంచి విమర్శనా గ్రంథం ఒకటి రాశారుట. దాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేస్తున్నారు,'' అంది మాలతి నిశ్శబ్దాన్ని భంగ పరుస్తూ.

"ఆహా! ఈమధ్య తురంగరావు రాయటం విరమించుకున్నా డనుకున్నానే," అన్నాడు మృత్యుంజయరావు వ్యంగ్యాన్ని జోడిస్తూ. 'పెద్దవాడిలా మాట్లాడు తున్నాను,' అని తనని తాను మెచ్చుకున్నాడు.

"ఇది సృజనాత్మకమైన సృష్టికాదు. విమర్శనా గ్రంథం. 'తెలుగు భాషలో ఆంగ్ల పర్యాయపదాలు,' గ్రంథం పేరు. చాలా కృషి చేసి, చాలా పుస్తకాలు చదివి కష్టపడి రాశాను. దానికి ఆవిష్కరణా, అదీ కొంత హడావుడి చెయ్యాలిగా," అన్నాడు తురంగరావు బోధపరుస్తూ.

"ఎవరిచేత ఆవిష్కరింప జేస్తున్నావు?"

"చూస్తున్నాను. పుస్తకం అచ్చు పూర్తయి రెడీగా వుంది. వారం పదిరోజుల్లో మంత్రులు పర్యటన నిమిత్తం యిటు వస్తున్నారేమో వాకబు చేస్తున్నాను. మంత్రి

గారు ఎవరూ లభించకపోతే ఛైర్మన్‌గారినో, కాలేజి ప్రిన్సిపాల్‌గారినో ఆహ్వానిస్తాను." అన్నాడు తురంగరావు.

"శుభం," అనుకున్నాడు మృత్యుంజయరావు మనస్సులో.

'అయితే మాలతిగారితో సంప్రదించవలసిన అవసరం ఏమొచ్చింది?' అని అడుగుదా మనుకున్నాడు. అదీ అడగలేదు.

కాసేపు కూర్చుని తురంగరావు "నాకు పనివుంది," అనిచెప్పి వెళ్ళిపోయాడు.

మాలతి నవ్వుతోంది – అన్నది: "విమర్శనా గ్రంథం రాయాలంటే చాలా తేలికట. మా నాన్నగారు చెబుతూవుంటారు. ఆ అంశానికి సంబంధించిన పుస్తకాలు ఓపది దగ్గర పెట్టుకుంటే చాలుట, అందులో ఓపేరా, యిందులో ఓపేరా యిలా గ్రంథం పూర్తిచేయవచ్చు?"

మళ్ళీ ఆమే "మా నాన్నగారంటే యీయనకు కోపం – నాటకదర్శకత్వం సరిగ్గా సాగనివ్వలేదని. ఒకసారి మా నాన్నగారు యీయన్తో 'మీతండ్రిగురించి తెలుసుగాని, నీగురించి నాకేం తెలియదు' అని సెటైర్ విసరటం నా చెవులబడింది," అంది.

మృత్యుంజయరావు నవ్వి ఊరుకున్నాడు.

కొంచం ఆగి మాలతి "అవునుగాని సోమయాజులుగారు మీ గురించి రిపోర్టు ఇచ్చారు. మీరు చాలా చెడ్డవారట. చాలామంది ఆడపిల్లలు ఫ్రెండ్స్ వున్నారట!" అంది.

అతని కేం చెయ్యాలో తోచక ముసిముసిగా నవ్వి వూరుకున్నాడు.

"తురంగరావుగారు కూడా చెప్పారులెండి. మీరు ఆయన్తో నాచెయ్యి పట్టుకున్నానని అన్నారట. ఎందుకు పట్టుకోనిచ్చావని కోప్పడుతున్నా రాయన."

అతను అదిరిపడి ఆమె ముఖంలోకి చూశాడు. సీరియస్‌గా అంటూందా, నవ్వులాటకి అంటూందా తెలుసుకోవటానికి ప్రయత్నించాడు. ఆమె ముఖంలో ఎక్కడా కోపచిహ్నాలు కనిపించలేదు. సన్నని చిరునవ్వు పెదిమలమీద మెదుల్తోంది. అతనివంకే గుచ్చి గుచ్చి చూస్తోంది.

"ఏమిటి? తురంగరావు అన్నాడా యీమాట?"

"అవునండీ."

అతను కుర్చీలో ముందుకు వొంగాడు. "మీరు నమ్మారా?"

"ఎందుకు నమ్మకూడదూ?" మాలతి కొంటెగా చూస్తోంది.

"అయితే అంతే నన్నుమాట నన్ను అర్థం చేసుకుంది?" అత నలా అనటమే సమయోచితంగా తోచింది. లోలోపల తురంగరావును శాపనార్థాలు పెట్టుకుంటున్నాడు. చీదస్తున్నాడు, ఛండాడుతున్నాడు.

నన్ను బడబాగ్నిలా దహిస్తోంది. ఇప్పుడే జన్మించినట్లుగా అనుభూతి – ఈ భూమ్మీదకు యిప్పుడే ఎక్కడినుంచన్నా ఎగిరివచ్చానేమో నని!

"నేను స్వామిని ఆరాధిస్తున్నాను. నాకు తెలుసు. కాని యీ ఆరాధనలో తాత్పర్యం నాకు తెలియదు. నాకు నిర్మలచిత్తం అలవడుతోందని నేను నమ్ముతున్నాను. ఈశ్వరుడ్ని ఏకాగ్రతతో ధ్యానించగలుగుతున్నాను. నా కోపం, హీన బుద్ధి, అభిజాతభావం అంతరించిపోతున్నాయి. అంతరంగం ఉన్మిషిత మవుతోంది. అవును, నే నప్పుడప్పుడూ ఏడుస్తున్నాను. కాని యిది దుఃఖాన్ని కడిగివేసే ఏడుపు.

"సాధించాలన్న నా పట్టుదలనూ, సర్వశక్తిమంతురాల నన్న నా అహంభావాన్నీ తుడిచివేసుకుని, నేను హృదయపూర్వకంగా స్వామి శిష్యురాలి నై పోయాను. కాని స్వామిలో నావాటికీ అధికమవుతూన్న కలవరపాటు నాకు ఆందోళన కలిగిస్తోంది. ఆయనలో పూర్వపు ప్రశాంతత, చిరునవ్వు, తేజస్సు లేవు. ఆ రాత్రి నాకు సాధనను అంత మహత్తరంగా బోధించిన ఆ మహాసీయుడు తీవ్ర మనోవేదనకు లోనైనట్లు పొడగట్టారు. పూర్వంలాగా ఆయన ఉపన్యాసం ప్రవాహవేగంతో గడవటంలేదు. ఏదో మరచిపోయినట్లు, సందేహాస్పదంగా వున్నట్లు తరుచు ఆగిపోతూ తడుముకుంటున్నారు. పూర్వపు వర్చస్సులేదు; కళలేదు; ఉత్సాహం లేదు. నేను ముందువరుసలో కూర్చుని ఆయన ఉపన్యాససారాన్ని గ్రోలుతూ వుంటాను. నా వైపు చూడకుండా వుండటానికి ఆయన ప్రయత్నిస్తున్నట్లూ, ఆ ప్రయత్నమంతా పటాపంచలై పోయి చూపులు నా వైపే అనుభంగికంగా మరలుతున్నట్లు నాకు స్ఫురించసాగింది. రోజూ ఆయన పాదాలను తాకి నమస్కరిస్తున్నాను. నా స్పర్శ తగిలినప్పుడల్లా, ఆయన విద్యుత్ఘాతం తగిలినట్లు స్తంభించిపోవటం నాకు అవగత మవుతోంది. ఓహో! నే నెంత పాపిని!! అతి దృఢమైన ప్రకృతిస్థితునిలోకూడా దుర్బలతి ప్రవేశపెడుతున్నాను. నా రాకతో అసలు మఠంలోని వాతావరణమే మార్పు చెందినట్లయింది. భక్తులలో మార్పు వస్తోంది. వారిలో ఏవో అనుమానదృక్కులు చెలరేగుతున్నాయి. శిష్యులు స్థిరచిత్తంతో పనిచేయటం మానేశారు. అందరూ నా వంక వింతగా చూస్తున్నారు. ఇంత అలజడికి కారణం నేనేనా? మఠానికి వెళ్ళటం మానేస్తే? చాలాసార్లు సాయంత్రం వరకూ యీరోజు ఏమయినా వెళ్ళకూడదనుకుని బింకంగా కూర్చునేదాన్ని. కాని సంజవేళ అవుతూండగా నా బింకం సడలిపోయేది. హృదయానికి అటువైపు కళ్ళెం వేసి ఏదో అజ్ఞాతశక్తి లాగేది. పాదాలు అటువైపు నడిచేవి. (సశేషం)

Printed and Published by Sri A. Sudhakar Rao for Yuva Concerns and at Yuva Press, Hyderabad-1. Telephones 36336, Press 34400.
Controlling Editor: Sri "CHAKRAPANI"

తురంగరావు తతంగమంతా సరిగా జరుగుతుందో లేదో అని స్టేజిమీదనుంచి లోపలకూ, లోపలనుంచి స్టేజిమీదకూ తిరుగుతూ చెడ్డ హైరాన పడిపోతున్నాడు. "ఇప్పుడు రచయితగారికి సన్మానం జరుగుతుంది." అని అధ్యక్షుడు ఎనౌన్స్ చేశాడు. తురంగరావుకు చెమటలు పట్టాయి. "ఇప్పుడే వస్తాను." అని క్షమాపణలు చెప్పుకుని తెరవెనక్కి వెళ్ళాడు. "పూలదండ లేవయ్యా మహానుభావా? పూలదండలు లేకుండా సన్మాన మెలాగ?" అని వైకుంఠంమీద విరుచుకుపడ్డాడు. "నాలుగు గంటలకే తీసుకురమ్మన్నానోయి. ఇప్పుడు ఆరు దాటినా వాడింకా తగులడలేదు." అని సంజాయిషీ యిచ్చుకుంటున్నాడు. "ఫోన్ చెయ్యి. టాక్సీమీద రమ్మను. అర్జంటు;'' తురంగరావు వగరుస్తున్నాడు. "ఉష్, జాగ్రత్త. మాటలు మైకులో వినబడుతాయి." అని వైకుంఠం రహస్యంగా హెచ్చరించాడు. వీళ్ళు ఎంత సేపటికీ బయటపడకపోయేసరికి ఏలూరునుంచి వక్తగా వచ్చిన ముకుందరావు ఏమిటేమి టంటూ లోపలకు వచ్చాడు. విషయం తెలుసుకుని తల బాదుకుంటున్నాడు. ఇంతలో ఆపద్బాంధవుడిలా పూలవాడు ప్రత్యక్షమయాడు. వాడికి నాలుగు అక్షింతలు వేసి, "కార్యక్రమం జాగ్రత్తగా కొనసాగించండి.'' అని పురమాయించి, స్టేజిమీదకు వెళ్ళి ఠీవిగా కూర్చున్నాడు తురంగరావు. ఫొటోగ్రాఫర్ కెమెరా సర్దుకుంటున్నాడు. ఏయే సందర్భాలలో స్నాప్స్ తియ్యాలో తురంగరావు ముందుగానే బోధపర్చి వుంచాడు. వైకుంఠం లోపలనుండి పూలదండ తీసుకుని అట్టహాసంగా వచ్చాడు. అతని కంఠంలో అలంకరించాడు. పట్టుపీతాంబరాలు మీద కప్పాడు. 'తిలకం దిద్దలేదేం?' అన్నట్లు తురంగరావు కళ్ళెర్రజేసి సౌంజ్ఞ చేస్తూ చూపాడు. వైకుంఠం నాలిక కొరుక్కుని గబగబ లోపలకు వెళ్ళి, తిలకంసీసా పట్టుకొచ్చి, అతని నుదుటన దిద్దాడు. వైకుంఠం తీసుకొచ్చిన అతని యింటివారి పాపలు హారతి పట్టారు. కెమేరామాన్ స్నాప్స్ కొట్టేస్తున్నాడు. సన్మానం పూర్తయింది.

తురంగరావు లేచి కృతజ్ఞత చెప్పుకుంటూ, తనకు జరిగిన సత్కారానికి చలించిపోయానని చెప్పాడు. కంఠంకూడా చలించేటట్లు చేశాడు. ముకుందరావు లేచి మైకుదగ్గర కొచ్చి, చేతు లూపుకుంటూ, గ్రంథంలోని ప్రాశస్త్యాన్ని గురించి గంటాయిరవై నిమిషాలు మాట్లాడాడు. సభ ముగిసింది.

## 11

జగతి డైరీ :

"కొద్ది రోజుల్లోనే యింత ప్రచండమైన మార్పు నాలో కలుగుతుందని స్వప్నంలోకూడా తలపోయలేదు. నిస్సంగత్వం అలవడుతోంది. నా అందం






మీ పిల్లల విద్యార్జనకు, వివాహాలకు. రిటైరు అయినప్పుడు మీ సౌకర్యాలకు అయ్యే ఖర్చులకు లోటు లేకుండా చేయగలదు. డబ్బు ఆదా చేసుకోడానికి జీవిత భీమా తేలిక అయిన మార్గం మాత్రమే గాక. అవసరమైనప్పుడు మీకు డబ్బు లభించగలదు మీ అబ్బాయి చదువుకు వచ్చేసరికి, మీ అమ్మాయి వివాహ సమయం ఆసన్నమయ్యేసరికి ఒకవేళ మీరు లేకపోవటమే సంభవించినా వాటికయ్యే ఖర్చులకు తగిన డబ్బును సమకూర్చగలదు ఇవన్నీ గాక, మీరు వయోవృద్ధులయినప్పుడు మీకు తగినంత ఆధారం వుంటుంది

మీ అవసరాలకు తగిన [illegible] సమీపంలోగల యల్‌ఐసి ఏజెంటును అడిగి తెలుసుకోండి.



జీవిత భీమాకు
ప్రతిగా మరొకటి లేదు

LIC SZ. 67

పరిస్థితి యిలా వస్తుందని తెలిసే, వాళ్ళను శాంతింపజేసే బాధ్యత వైకుంఠం మీద పెట్టి తురంగరావు చల్లగా తప్పుకున్నాడు. వైకుంఠం పొట్టిగా, గుమ్మటంలా వుంటాడు. తను హాస్యప్రియుడని అనుకుంటూ వుంటాడు. అంతేకాదు, ఎవరి మాటలు వాళ్ళకు చెప్పటంలోనూ, ఎక్కడికక్కడ సర్ది చెప్పటంలోనూ ఉద్దండుడు. చిన్నప్పుడు తురంగరావూ, అతనూ సహచరులు. ఇద్దరూ వివాహితులు. తురంగరావుకు పిల్లలు పుట్టారు; ఇతనికి కలగలేదు. ఈ మధ్య యిద్దరూ కలసి ఎమ్. ఏ. కి ఉత్కళ యూనివర్సిటీలో కడదామని కలిసి చదవటం మొదలుపెట్టారు. 'గలివర్స్ ట్రావెల్స్' చదువుతున్నారు. 'అది గలివర్ కాదు, గులివర్' అన్నాడుట తురంగరావు, అతన్ని ఏడిపించటానికి. అతను నమ్మి నలుగురితోనూ "ఈ మధ్య 'గులివర్స్ ట్రావెల్స్' చదువుతున్నాను," అనటం సాగించాడుట. అంతా ఒకటే నవ్వులు. "నేనే అలా చెప్పాను ఏడిపించటానికి. అయినా బి. ఏ. ప్యాసయినవాడికి గలివర్ని ఎలా ప్రొనౌన్స్ చెయ్యాలో విచక్షణాజ్ఞానం ఏడవద్దూ?" అని తురంగరావు పేరుపేరునా పిలిచి చెప్పాడు.

ఇలాంటివి జరగటంవల్ల వైకుంఠానికి తురంగరావంటే గుర్రుగా వుండేది. కాని అవసరానికి తురంగరావు అతన్ని దగ్గరకు చేరదీసి, బుజ్జగించి, "నలుగురూ మన స్నేహాన్ని పాడుచేయాలని చూస్తున్నారు. ఇహమీదట మనం ఒకరిగురించి ఒకరు చెడుగా మాట్లాడుకోవద్దు," అని దువ్వాడట. ఇతను దువ్వించుకున్నాడు. క్రమంగా తురంగారావంటే వైకుంఠానికి గురుభావంకూడా ఏర్పడింది.

అతను తురంగరావును మరీ వెనకేసుకురాకుండా "పోనీ పాపం, అతను కక్కుర్తి పడ్డాడు. సభ్యుల్ని సంప్రదించకుండా అచ్చువేయించటం మంచిపని కాదనుకోండి. కాని బయటకు చెబితే ఒప్పుకోమనే భయంచేతకదా, అలా తాపత్రయ పడింది. ఏది ఏమయినా తురంగరావు మనవాడు; మన ఎసోసియేషన్ వ్యవహారాలలో కష్టపడి పనిచేసినవాడు. ఇప్పుడతనిమీద దాడిచేసి, సన్మానం జరగకుండా చూస్తే, పాపం, అభాసుపాలు అవుతాడు. ఇంకో విషయం. డబ్బు: డబ్బు సమితినుండి ఏమీ ఖర్చు పెట్టక్కర్లేదు. పేరు సమితిది, ఖర్చు అతనిది," అని మెల్లిగా నచ్చచెప్పాడు.

నలుగురూ సంప్రదించుకుని, తృప్తిపడి సరే అన్నారు.

ఆవిష్కరణ రోజు వచ్చింది. ఆ నాడు తురంగరావు పడ్డ కష్టం వర్ణనాతీతం. సభకు సుమారు నాలుగువందలమంది అయినా వస్తారని డెబ్బయిఅయిదు రూపాయలు అద్దెయిచ్చి పెద్దహాలు తీసుకుంటే, పట్టుమని పాతికమంది ప్రజలైనా రాలేదు.

భారతదేశమంతటి నుండియు వచ్చిన అయాచితమైన యోగ్యతా పత్రములు ఇలా తెలుపుచున్నవి

# ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు పనుచిగుళ్ల బాధలను దంత క్షయమును నిలుపును

పను చిగుళ్ల బాధలు మరియు దంతక్షయమునకు ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు కలిగించే ప్రయోజనములను జనులు అన్ని వయస్సుల వారున్ను ప్రశంచుచున్నారు.

## వారు ఏమి చెప్పుచున్నారో చదవండి

నా పళ్లు ఇంత తెల్లగా మెరయుచుండుటకు కారణం ఇప్పటికి నేను చాలాకాలమునుండియు వాడుచున్న ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టే. నేను దానికెంతో ఋణపడి యున్నాను. నేను ఇరువది ఏడు సంవత్సరముల వయస్సుగల యువకుడను. తాంబూలం, పొగాకు నమలుట నాకు అలవాటు. పొగాకు నమలుటవల్ల పళ్లు మరకలుపడి వాటిమీద నల్లటి రంగు ఏర్పడునని మీకు తెలుసుగదా! అయితే ఫోర్‌హాన్స్ పేస్టు చమత్కారమును జరుపుచున్నది. మరకలన్నిటిని తొలగించి నా పళ్లను మెరయుచుండే తెల్లగా వుంచుచున్నది. పి.వి. బెంగుళూరు.

"మీ ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టును వాడుటవల్ల నా ఘోరమైన పనుచిగురు బాధ విముక్తి గురించి మీకు తెలుపుట నా విధియని భావించుచున్నాను. ఇపుడు నేను మీ ఫోర్‌హాన్స్‌ను ఎడతెగక వాడుచున్నాను. నేను ఇంతకుముందు దారుణంగా అనుభవించి యున్నట్టి పనుచిగుళ్లు నొప్పులు, మంటబెట్టుచుండే ఉబ్బిన పను కురుపులు, నోటి దుర్గంధం లేకుండా సుఖంగా వున్నానని ఎంతో సంతసమున తెలుపుచున్నాను. భగవంతుడు ఫోర్‌హాన్స్‌ను సర్వదా వర్ధిల్ల నాశీర్వదించుగాక అని కోరుచున్నాను." హెచ్.ఆర్.ఎస్. బొంబాయి.

"నేను ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టును నా పదమూడవ ఏటనుంచి వాడుచున్నాను మరియు మా కుటుంబములో అందరూకూడా ఈ టూత్‌పేస్టునే వాడుచున్నారు. పళ్లను మెరయుచుండే తెల్లగాను, పనుచిగుళ్లను ఆరోగ్యవంతమైన గట్టిగాను వుంచుటకు ఉపయుక్తమైయున్నది అని గ్రహించితిమి అని మీకు తెలుపుచున్నాను. శ్రీమతి కె.వి. బెంగుళూరు.

ఈ యోగ్యతా పత్రములను జాఫ్రె మేనర్స్ అండ్ కం. లిమిటెడ్ వారి ఏ ఆఫీసులోనైనా చూడవచ్చును.




**ఫోర్‌హాన్స్** దంతవైద్యునిచే తయారుచేయబడిన టూత్‌పేస్టు

ఉచితం! **CARE OF THE TEETH AND GUMS** అనే రంగుల చిన్న పుస్తకము దంత భద్రతగురించి చిన్న సచిత్ర పుస్తకం ఒక ప్రతి మీకు కావలసినయడల (తపాలా ఖర్చుల నిమిత్తం) 10 పై. తపాలాబిళ్లను పంపండి. డిపా. Y. 11, మేనర్స్ డెంటల్ ఎడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం. 10031, బొంబాయి-1.

Y-11

పేరు..............................................

చిరునామా..............................................

..............................................

క్షణంలో అతని వీరత్వం ఎగిరిపోయింది. తను ఎక్కడ్నుంచి వస్తున్నదీ పసి గట్టాడా? తనని దగ్గరకు పిలుస్తాడా? తిడతాడా? అతని గుండె గబగబ కొట్టు కుంటోంది. కాని శేఖరం అతన్ని చూసీ చూడనట్లు త్వరగా నడుచుకుంటూ వెళ్ళి పోయాడు.

*　　　*　　　*　　　*

కొన్నాళ్ళకు తురంగరావు నిజంగానే తన గ్రంథాన్ని ఆవిష్కరించటానికి సభ ఏర్పాటు చేశాడు. మొదట్లో సభ్యులలో ఎవరూ యీ ఆవిష్కరణ మహోత్సవా నికి అంగీకరించలేదు. కాని అతను దెబ్బలాడి, అనేక పాయింట్లు లేవదీసి, విడి పోతానని బెదిరించి, మొత్తంమీద అందరూ ఒప్పుకునేటట్లు చేశాడు. వైకుంఠాన్ని బాగా ఉబ్బేసి, తనకు ఆసరాగా వుండేటట్లు చేసుకున్నాడు. ఆవిష్కరింపచెయ్యా టానికి మొదట మంత్రులకోసం ప్రయత్నాలు జరిపాడు. కుదరలేదు. కలెక్టరుగారి కోసం కృషిచేశాడు. వీలుపడలేదు. చివరకు కాలేజీ ప్రిన్సిపాలుగార్ని అభ్యర్థించి అంగీకరింపజేశాడు.

ఆహ్వాన పత్రాలు అచ్చయాయి. అందులో 'రచయితకు సన్మానం' అనే అంశం చూసి సభ్యులు విస్తుపోయి, ముక్కుమీద వేలేసుకున్నారు. "మాతో సంప్రదించ కుండా సన్మానమని ఎలా అచ్చువేశాడు?" అని తారాజువ్వల్లాగా లేచారు.

# తలనొప్పి?

# అవేదన్

## తీసుకొని చిటికెలో పోగొట్టుకోండి

SQUIBB

SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్కు. రిజి. లైసెన్సు ఉపయోగదారులు శరంజండ్ ప్రైవేట్ ప్రైవేట్ లిమిటెడ్.

ఆశ్చర్యకరమైన "ఏపెప్" కల అవేదన్ తలనొప్పి, జలుబు, ఫ్లూ యితర శరీర నొప్పులను త్వరగా, సురక్షితముగా, నిశ్చయముగా నివారణచేస్తుంది.

Shilpi SC 51A/67 Tel

మరింకా ఎలా మాట్లాడాలి?

'అసలు నాకు మొదట ఏమీ అభిప్రాయం లేదండీ మీమీద. చీటికీ మాటికీ వచ్చి నిజం చెప్పు. మీ యిద్దరికీ ఏమయినా వుందా? అని వేధించటంద్వారా యీ తులు వలు కల్పించారు. ఎడతెగకుండా వాళ్ళలా వేధించుకుతినేసరికి నేను మీ గురించి ఆలోచించటం మొదలుపెట్టాను. రానురానూ ఆలోచించటం ఎక్కువయింది. చివరకు ఆలోచించకుండా వుండలేకపోయాను. మీ రేమీ ఆలోచించటంలేదా మాలతీ?'

ఎంత సూచనప్రాయంగా, మెత్తగా, భావస్ఫోరకంగా వుంది యిలా మాట్లాడితే?

కాని తను మాట్లాడలేదు. మాట్లాడలేకపోయాడు.

ఓ మంచి అవకాశాన్ని, దేముడు కరుణించిన తరుణాన్ని పాడుచేసుకున్నాడు; పోగొట్టుకున్నాడు.

కాని ఓ రకంగా మనసులో అనుకున్నట్టుగా మాట్లాడకపోవటమే మంచిదయింది.

'ఎందుకని? ఎందుకని అంటావురా జయా?'

'నే నేమీ ఆలోచించటంలేదు' అని ఆమె అంటే? 'మీ రలా ఆలోచిస్తున్నందుకు నేను చాలా విచారిస్తున్నాను' అని ఆమె అంటే? 'మీరు చాలా మంచివారనుకున్నాను. మీ మొగబుద్ధి పోనిచ్చారుకాదు' అని ఆమె అంటే? 'నీ వొంకరముక్కూ నువ్వూనూ. ఏముంది నీ గురించి ఆలోచించటానికి నా బొంద' అని ఆమె అంటే?

అతను ఊహించలేకపోయాడు. వంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకినట్లయింది.

'మంచిపని చేశాను,' అని సంతోషించాడు.

అతని ఉపన్యాసం విని మాలతి ఏ వ్యాఖ్యానమూ చేయలేదు. చిన్నగా నవ్వి ఊరుకుంది.

కాసేపటికి ఆమె "మీ అక్కగార్ని మళ్ళీ ఎప్పుడూ చూపించలేదేం? నన్ను రమ్మంటే నేను వస్తాను. లేకపోతే ఒకసారి ఆమెను మా యింటికి తీసుకుని రాకూడదూ?" అంది.

అతనికి వారిద్దరూ తిరిగి కలుసుకోవటం యిష్టంలేదు. మాలతి ఆమెను గుచ్చి గుచ్చి ప్రశ్నలు వేస్తుంది. జగతి చాపల్యం కల మనిషి కావటంవల్ల అన్నీ బయట పెట్టేస్తుంది. అది అతనికి రుచించదు.

"ఆమెకు యీమధ్య తీరిక వుండటంలేదు. వీలు చూసుకుని ఒకసారి తీసుకు వస్తానులెండి." అన్నాడు. మాలతి మళ్ళీ ఆ ప్రసక్తి ఎత్తలేదు.

* * * *

ఆ రాత్రి మాలతి యింటినుండి తిరిగివస్తూంటే అతనికి దారిలో శేఖరం ఎదురయ్యాడు. స్ప్రిట్ లైట్ వెల్తురులో సిగరెట్టు కాల్చుకుంటూ వస్తూ కనిపించాడు.



## ఇలా చేయడము ప్రమాదకరము !



ఎండిన గులిమిని హెయిర్ పిన్ లేదా వాడియైన వస్తువులతో తీయుటకు ప్రయత్నించడము ప్రమాదకరము అవవచ్చును. దానితో సెప్టిక్ అయే పరిస్థితులు ఏర్పడి, శాశ్వతముగా చెవి పాడవునదే కాక, చెముడు కూడ రావచ్చును.




## ఇలా చేయడము ఖర్చు ఎక్కువ !

వినుటకు ఉపయోగించే సాధనములు ఖరీదైనవి మరియు చికాకైనవి. చెవులు సరిగా వినపడక పోవుట, చెవిలో హోరుమని ధ్వని, వాపు, దురద మరియు బాధలకు మామూలుగా చెవిలో ఎండిన గులిమియే కారణము









నిషక్ ఔషధయుక్తమైన చెవిపోటు మందు, చెవిలో ఎండిన గులిమిని, దుమ్ము మొదలైన వాటిని తీసి వేయుటకు, చెవులను శాస్త్రరీత్యా శుభ్రము చేయుటకు, వాపు మరియు బాధను కలిగించే రోగములను, సూక్ష్మ క్రిములను సౌమ్యముగా నాశనము చేయుటకు తయారుచేయబడినది. నిషక్ చెవిపోటు మందు దురదను, బాధను వెంటనే పోగొట్టును. సూక్ష్మ క్రిముల ద్వారా మళ్లీ రోగములు కలగకుండా కాపాడును...అందువలన వినపడే శక్తిని బాగుచేయును

100 మందిలో 5 గురు స్కూలు పిల్లలు గులిమి, చెవి రోగములతో సరిగా వినపడక బాధపడుతున్నారని లెక్కలు కట్టి నిరూపించబడినది పెద్దవారిలో యీ శాతము ఇంకా ఎక్కువే ఉండవచ్చును

నిరపాయమైనది మరియు సౌమ్యమైనది, క్రమముగా వాడదగినది.



## ఆఖరికి... ఒక క్రొత్త శాస్త్రరీత్యా తయారైన ఫార్ములా




- గులిమిని కరగించును
- రోగములను నివారించును
- బాధను పోగొట్టును
- బాగుగా వినపడేలా చేయును

కొచ్చిన్ పాప్స్ ప్రైవేట్ లిమిటెడ్ బొంబాయి-26 - కొచ్చిన్-2 ● నిటాల్ పెదిమల క్రిములు తయారుచేయువారు

డిస్ట్రిబ్యూటర్స్ : మెసర్స్ గణపతి అండ్ కంపెనీ
103/104, లింగిచెట్టి స్ట్రీట్; పో॥ బా॥ నెం॥ 1983. మద్రాస్-1

మాలతి అతనివంక సానుభూతితో తిలకించింది. "ఎందుకండీ అలా కంగారు పడతారు? మనుషుల మనస్తత్వాలూ, ప్రవర్తనలూ నా కామాత్రం తెలియ వనుకున్నారా? ఈరోజున తురంగరావు పనిగట్టుకుని వచ్చి అవాకులూ చవాకులూ పేలినంతమాత్రాన ఎలా నమ్ముతాను?"

అతను సేదతేరి, నిశ్చింతిగా నిట్టూర్పు విడిచాడు. 'హమ్మయ్య! ఓ గండం గడిచింది.'

ఆ తర్వాత అతను ఉపన్యాసంలాంటది యిచ్చాడు. మాట్లాడుతున్నంత సేపూ ముఖాన్ని వికారంగా పెట్టాడు. ఈ సంఘాన్నీ, ప్రజల్నీ, ప్రపంచాన్నీ తెగ విమర్శించాడు. పాడు సమాజం—ఒక స్త్రీ, పురుషుడూ కలసివుంటే ఓర్చ లేదన్నాడు. వదంతులు పుట్టిస్తుందన్నాడు. తన నిష్కల్మష హృదయాన్ని చాటుకోవటానికి ప్రయత్నించాడు.

కాని మాట్లాడుతున్నంత సేపూ మనసులో సంఘర్షణ ననుభవిస్తూనే వున్నాడు. అబ్బే యిలా మాట్లాడ కూడదు నేను,' అనుకుంటున్నాడు.

YUVA February, '68 **One Rupee** Regd. No. H 131